# ఉత్తరాంధ్ర

(చరిత్ర - సంస్కృతి)








పబ్లిషర్స్
కన్వీనర్
**ఉత్తరాంధ్ర**
(ప్రగతి - సాధన - సమితి)
విశాఖపట్టణం

# Utharandhra

(History & Culture)

*Written by :*

**Prajakavi - Vangapandu - Appalaswamy,**

Rtd. Principal

Correspondent

**T.S.R. National Junior College**

Pendurthi - 531173, Visakhapatnam

Phone : 0891 - 2767594

Publication : 2003

Copies : 1000



*For Copies*

**U.K. Book Distributors**

Plot-No.7-65, Prasanthi Nagar,

Pendurthi - 531173

Visakhapatnam.

**PRICE : Rs. 50/-**

# ఉత్తరాంధ్ర

(చరిత్ర-సంస్కృతి)

## మనవి

తర తరాలగ - విద్యకు - దూర మగుచు
గౌరవం లేక చుల్కనగ - చూడబడిన
వీరినే బడుగులని నాడు తెలుప
ఎల్లరును నేడు బీ.సి. లని పిలవబడిరి

మాకు ప్రత్యేక రాష్ట్రమని అడుగబోము
ఆంధ్ర - తెలంగాణా - విభజన - నడ్డుకోము
బడుగు జన ప్రగతి సాధన సమితి మనది
ఎత్తరాజెండ మనదేను ఉత్తరాంధ్ర

నష్టపడిన కళింగాంధ్ర-పుష్టిగాంచ
ఉత్తరాంధ్రకుప ముఖ్యమంత్రి పదవి
పాలనా భివృద్ధి మండలి, కావాలి మాకు
బడుగు వాడను - బాధలు-పడినవాడ


రచయిత
ప్రజాకవి-వంగపండు
పెందుర్తి
విశాఖపట్నం
ఉత్తరాంధ్ర

# ఉత్తరాంధ్ర

(చరిత్ర-సంస్కృతి)

## అంకితం



కె. చంద్రశేఖరరావు M.L.A.

అధ్యక్షులు

తెలంగాణ-రాష్ట్ర-సమితి

హైదరాబాద్

వీర "తెలంగాణ" - వేరను- ధీరుడితడు

భూమి, హక్కుల గాపాడు - యోధుడితడు

వేరుపడిన మన చెలిమి - వీడదనగ

చంద్రశేఖర రావుజీ - చేకొనుముకృతిని

ప్రజాకవి-వంగపండు

పెందుర్తి

విశాఖపట్నం

ఉత్తరాంధ్ర

తే 1-1-2003 ది

హైదరాబాద్

# ఉత్తరాంధ్ర

(చరిత్ర-సంస్కృతి)

ఇందులో




ప్రజాకవి-వంగపండు

రచయిత

పెందుర్తి – విశాఖపట్నం

ఉత్తరాంధ్ర



ప్రజానాయకుడు
**సర్దార్ గౌతులచ్చన్న**

ప్రజాకవి - గ్రంధకర్త
**సర్దార్ గౌతులచ్చన్న**

# ఉత్తరాంధ్ర

(చరిత్ర - సంస్కృతి)

## ప్రథమ భాగము

### 1 వ ప్రకరణం - ఉత్తరాంధ్రులు

1) సిరి సంపదల జల-నిధులు మనకున్నవి
వేలకొలది-భూవిస్తీర్ణముంది
కోటిమంది ప్రజలు - కొలువు తీరున్నారు
సహజవనరుల కల్పతరువు మనసీమ
వీరులం - ధీరులం - విశ్వ విఖ్యాతులం
వన్నెకెక్కిన జనసంతతులము
ఉద్యమాలను నడిపె ఉత్తేజపరులము
సంకల్పధీఃశక్తి సారధులము
కన్నతల్లి - కళింగాంధ్ర - మనకల్పవల్లి
పూర్వవైభవ ఘనకీర్తి స్ఫూర్తిదాత
ఘనచరిత్ర వారసులముత్తరాంధ్రులముర
ఎత్తరాజెండ - మనదేను - ఉత్తరాంధ్ర

2) అతిపురాతన ధన్యచరిత కళింగర
మన కన్నతల్లికి మనసాస్మరామి
వేయేండ్ల క్రిందటనే వెలసెర -మనజాతి
అతిపురాతన జాతి - ఆంధ్రజాతి
బహుతెగలాంధ్రులని - భారతము దెల్పినది
మన మాతృభూమి కళింగభూమి
వేదవిశ్వామిత్ర బిడ్డలమనె స్మృతి
బలిపుత్రులమనె భాగవతము
రాజఋషి వారసులం - బలి చక్రవర్తి తండ్రి
పుట్టుకతో ఆంధ్రజాతిది గొప్పదికద
ఘనచరిత్ర వారసులముత్తరాంధ్రులుముర
ఎత్తరా జెండ - మనదేను - ఉత్తరాంధ్ర

- ప్రజాకవి - వంగపండు

3\. జాతికి ఆంధ్రులం స్పష్టలం కళింగ
దేశవాచకమిది కళింగదేశమనగ
కళింగ పదమున కర్థ నిఘంటువు
మహిళ పర్వతరాణి అనుచు దెల్పె
మాతృస్వామ్యవ్యవస్థ మనకనాదిగ నుండె
ఇల్లాలె - ఇంటికి దీపమనిరి
మనువు చెప్పెమనల నడవి వాసులమని
వర్ణ సంకరులనె వసుధలోన.
ఘన కళింగలో - కాలుమోపిన - ఆంధ్రులమురా
జాతి పేరాంధ్ర కళింగ "ఆంధ్ర" మనది
ఘనచరిత్ర వారసులముత్తరాంధ్రులమురా
ఎత్తరాజెండ - మనదేను - ఉత్తరాంధ్ర

4\. ప్రాగ్దక్షిణోత్తర - భారతావని యందు
తూర్పుకనుమల వెలసెనుత్తరాంధ్ర
ఉత్తరమున -ఒరిస్సా - తూర్పున - సాగరం
తొలిప్రొద్దు దిశగల దుత్తరాంధ్ర
దక్షిణమున త్రిలింగ పశ్చిమాన శబరి
ఎత్తైనకొండల - నుత్తరాంధ్ర
తూర్పు కనుమలలో వెలసెనుత్తరాంధ్ర
ఓడరేవుల జాడ ఉత్తరాంధ్ర
దక్షిణమున త్రిలింగ పశ్చిమాన శబరి
ఉత్తరమున మహేంద్రగిరి - ఉన్నతినిజూపు
మన కళింగాంధ్ర ఒకనాటి భాగ్యసీమ
ఎత్తరాజెండ - మనదేను - ఉత్తరాంధ్ర

5\. సృష్ట్యాది మానవుడిట పుట్టినాడన
దిశమొల అటవిక తెగలెసాక్షి
పశ్వాన్న భక్షకులు కానన నివాసులు
మనువుదెల్పిన నాటి మాట సాక్షి
తొలి మానవునికి - మలిరూపమిచ్చిన
తూర్పుకనుమల బొర్రగుహలే సాక్షి
జలది - వసుంధర - జట్టు కట్టుననగ
ఉద్దానమడవుల ఉనికి సాక్షి
అన్ని సాక్షుల కన్నను అసలుసాక్షి
ఉత్తరాంధ్రలో అమ్మోరు పూజసాక్షి
పుడమితల్లిని పూజించె పుత్రులమురా
ఎత్తరాజెండ - మనదేను - ఉత్తరాంధ్ర

4\. ఆదికవి వాల్మీకి - రామాయణంబున
ఘనత గలిగినదనె మన కళింగ
వ్యాసముని భారతము వర్ణించెనుకద
కలిమిగలదనగను మన కళింగ
దేవీ భాగవతము దెల్పియున్నది కద
ఆదిశక్తిని గొల్చె మన కళింగ
ఎల్ల పురాణాల్లో ఇతిహాసాలలో
సన్నుతినందెను - మన కళింగ
ఎన్నోజన్మాల చేసిన - పుణ్యఫలమొ
పుట్టితిమి కళిగాంధ్రిది పుణ్యభూమి
ఘనచరిత్ర వారసుల ముత్తరాంధ్రులమురా
ఎత్తరాజెండ - మనదేను - ఉత్తరాంధ్ర

- ప్రజాకవి - వంగపండు

7. మన కళింగలోనే - మహేంద్రగిరిపైన
అర్జునుడు ఘోర తపస్సుజేసే
మన కళింగలోనే, పాండవులతిథులై
భీముని పట్నాన భిక్షగొనిరి
మన కళింగలోనే దండకారణ్యాన
పంచవటి రాముని స్వాగతించె
మన కళింగలోనే వ్యాస భగవానుడు
అడుగు పెట్టగ అంబకనికరించె
రామరావణయుద్ధాల నరసిన భూమి మనది
భరత యుద్ధాన నిలచిన జాతిమనది
ఘనచరిత్ర వారసుల ముత్తరాంధ్రులమురా
ఎత్తరాజెండ - మనదేను - ఉత్తరాంధ్ర

8. వైదికుడ శోకుడ వైదికుల దండించ
ముందుపడ కళింగ యుద్ధమయ్యె
ఆర్యక్షత్రియునితో నవార్యుడు తలపడి
పోరాడ బొబ్బిలి యుద్ధమయ్యె
ఇంగ్లీషుదొరలను యెదిరించ గజపతులు
పుడమి పద్మనాభ యుద్ధమయ్యె
శాతవహనుని మన ఖారవేలుడు తరుమ
పృద్వి, "కళింగ - త్రిలింగ" యుద్ధమయ్యె
గెలుపు - ఓటమి - జాతికి - మలుపుకాదు
శత్రువుకి - శిరమువంచని చరిత్రమనది
ఘనచరిత్ర వారసుల ముత్తరాంధ్రులమురా
ఎత్తరాజెండ - మనదేను - ఉత్తరాంధ్ర

- ప్రజాకవి - వంగపండు

9) స్వారాజ్య సాధనకు సర్వశక్తులొడ్డి
పోరాడి నిలచెరా ఉత్తరాంధ్ర
రైతోద్యమాలతో చేయెత్తి జేకొట్టి
ముందుపడినిలచెరా ఉత్తరాంధ్ర
మన్యజన దోపిడి - దళారులనరికట్ట
ఉడుకు రక్తమిచ్చె నుత్తరాంధ్ర
అసమానతల బాప అందరొకటనిచాట
ఉద్యమాలపుట్ట ఉత్తరాంధ్ర
లొంగి - ఉండుట - మన ఇంట - వంట - లేదు
ఉద్యమాలకు నూపిరి లూదినాము
ఘనచరిత్ర వారసుల ముత్తరాంధ్రులమురా
ఎత్తరాజెండ - మనదేను - ఉత్తరాంధ్ర

10) ఆది శివలింగముద్భవించె నిటనె
శ్రీముఖ లింగము - "కళింగకాశి"
సంగాము తీర్థము - సంగమం "త్రివేణి"
నాగావళీ - స్వర్ణముఖి - వేగవతులు
బలరామ ప్రతిష్ఠ-నైదుశివ కోవెలలు
వెలసేనాగావళీ - తీరమందు
ఈశ్వరాలయమురా - నేటి మన - కూర్మాము
కన్పించునట-ధ్వజ స్తంభద్వయము
ఉత్తరాంధ్రలో - శైవమే - నిలువెత్తు నిలచె
శాక్తేయులం - కళింగాంధ్ర - శక్తి - మయము
జంగమయ్యలె - గురువులు - జనులకెల్ల
శైవక్షేత్రాల మయమే - కళింగ భూమి

- ప్రజాకవి - వంగపండు

11) నందులనార్యులు-క్షత్రియాంతకులుర
చంద్రగుప్తుడు సార్వభౌముడుకద
అశోకుడ వైదిక చక్రవర్తిగ మారి
బౌద్ధమును కళింగలో బోధజేసే
బౌద్ధ స్థూపాలను బౌద్ధ విహారాల్ని
కట్టైనిటన వైదికం దిట్ట పడగ
బడుగు-జనహితము-బౌద్ధ మతమనగను
మన ఖారవేలునికి దారిజూపె
దంతవరం - శాలి హుండం - పావురాలకొండ
తొట్లకొండ - బాలకొండ - బొజ్జన్నకొండ
ఘనచరిత్ర వారసులముత్తరాంధ్రులముర
బౌద్ధ క్షేత్రాల కళింగ పుణ్యభూమి

12) అతిపురాతన - కళింగ - పాలకులతిరధులు
మన పూర్వవైభవం-జగతిఘనము
బింబిసారుడ జాతశత్రువు నందుడు
మౌర్యచంద్ర గుప్తడశోక ప్రభువు
మెగస్తనీ సిండికలో కళింగను పేర్కొని
కరి తురగ బలాఢ్యయనుచు దెల్పె
ఉత్తర భారతం పాలకుల పాలనలో
జైన బౌద్ధమిచట వ్యాప్తినందె
దంతపురము నాటి కళింగ రాజధాని
పిష్ట పురమననేటి మన పిఠాపురంబు
దంతపురమన మన ముఖలింగమేకద
ఘన చరిత్ర వారసులముత్తరాంధ్రులు

- ప్రజాకవి - వంగపండు

13 ) వెలనాటి కులోత్తుంగ-చోళుడురాగ
తూర్పుగాంగులునాడు పోరుసలిపె
కాకతీయులు కదిలి కళింగకు విచ్చేయ
పాండ్యులటవెన్నంట పట్టిచటతప్పె
మన కళింగను రెడ్లు పాలించ వచ్చిన
మన ధాటికాగక మరలిపోయె
ఓఢ్ర పాలకులనోడించి వెనువెంటే
కృష్ణదేవరాయ విభుడు వెళ్ళె
ఏ ఒకరు నిల్చిట కళింగాంధ్ర నేలనేదు
దండయాత్రలతో సరిపెట్టె సాగినారు
ఘనచరిత్రవారసులముత్తరాంధ్రులమురా
ఎత్తరాజెండ - మనదేను - ఉత్తరాంధ్ర

14 ) వైదికేతర మహిళ - లిచట పాలించుట
వేద బాహ్యమశోకుడెదిరించవచ్చె
క్షత్రియేతర తూర్పుగాంగులు దండించ
పురుష దత్తిక్ష్వాక ప్రభువు వచ్చె
అనార్య కళింగన నార్యులెపాలించ
నుక్కడించ సముద్ర గుప్తుడొచ్చె
రచ్చకీడ్చిన మన సంస్కృతి చావలేదు
ఉక్కు పిడుగులం మన కమ్మ ఊతఉంది
ఘన చరిత్ర వారసులముత్తరాంధ్రులమురా
ఎత్తరాజెండ - మనదేను - ఉత్తరాంధ్ర

---- ★ ----

- ప్రజాకవి - వంగపండు

# ఉత్తరాంధ్ర

(చరిత్ర-సంస్కృతి)

ప్రథమ భాగము

## 2వ ప్రకరణం - బడుగు సంస్కృతి

1. ఉత్తర భారతం - దూరాన - నిలవగ
వైదిక సంస్కృతి మన కంటలేదు
దక్షిణ భారతం దరిదాపులలో లేదు
ద్రవిడ సంస్కృతి మనదరికి రాలేదు
వైదికులముకాము - దస్యులసలేకాము
మనమనార్యులం - వర్ణ సంకరులము
ఉనికి - భౌగోళిక కనుమల్లో ఏపినాల్లో
పుడమి సంస్కృతిచట పుట్టెనుకద
ఆదినుండి మాతృస్వామ్యానికి వేదిక ఇది
ఉత్తరాంధ్ర బడుగు జనుల కూపిరికద
బడుగు జన సంస్కృతి మన భాగ్యరాశి
ఎత్తరా జెండ ముందుండ ఉత్తరాంధ్ర

2. బడుగు జనులుండెడి ఆదిమ స్థలమిది
దరిమిలా వైదికులు దరి జేరిటకు
మరణ జన్మకర్మ - లన్నియు నాదిలో
జంగమ దేవరలే జరిపెవారు
జన పదము కళింగ మన నివాససీమ
ఉమ్మడి బ్రతుకుల కమ్మదనము
తెగలగ వెలిసాము - తెలివిగ బ్రతికాము
కులము వర్ణాలనెడి ఊసేలేదు
పుడమితల్లి సంస్కృతిచటను పుంజుకొనియె
బడుగల్లెల్లరు లమ్మోరు బిడ్డలనగ
శూద్ర జన సంస్కృతీ - ఉత్తరాంధ్రులమురా
ఎత్తరాజెండ - మనదేను - ఉత్తరాంధ్ర

- ప్రజాకవి - వంగపండు

3) వర్ణ ప్రవృత్తులను వైదికులు దెల్పిన
హుళక్కి - అనక - ఊకొట్టెతిమిర
జైన బౌద్ధులొచ్చి జనాల జోరబడి
దేవుడెవరన్నను దెప్పలేదు
పుట్టుకతో బుద్ధులు పుడమివచ్చు ననగ
కాదనుచు ఒకమాట పలకలేదు
జీవించు త్రోవలే ప్రవృత్తులకు మూలమన
లేదనుచు ఒకనాడు చెప్పలేదు
పుడమితల్లి సంస్కృతికి పుత్రులమురా
సర్వ ధర్మ సమభావ సచ్చరిత్రులమురా
బడుగు జన సంస్కృతీ-ఉత్తరాంధ్రులమురా
ఎత్తరాజెండ - మనదేను - ఉత్తరాంధ్ర

4) ఆర్యనార్య ధర్మ సంగమ నిర్ణేత
బిందుసారుని స్వాగతించినాము
అవైదికానికి అడ్డుగానిలచిన
మహా పద్మనందునికి మాట ఇచ్చితిమి
వైదిక ధర్మమును వ్యాపింపజేసిన
ఘన చంద్రగుప్తునికి వరమిడితిమి
సంఘ ధర్మమును చాటింపువేసిన
ఘన అశోకుని నాడు గౌరవించితిమి
చక్రవర్తులు కళింగనేలిన ఘనులు వీరె
అతిపురాతన కాలాన గతిని గలిగి
బడుగు జన సంస్కృతీ-ఉత్తరాంధ్రులమురా
ఎత్తరాజెండ - మనదేను - ఉత్తరాంధ్ర

- ప్రజాకవి - వంగపండు

5) వేడుకలు - విందులు - ఎచ్చోట జరిగిన
బడుగుల గుంపులు అడుగులేను
జాతరలు యాత్రలు సాగు చోట్లెల్లను
బడుగు జన సందడి సంబరాలు
బ్రతుకులు కొనసాగు భంగిమలు జన్మించ
ముందడుగు బడుగులదె సందడికద
భుక్తి - రక్తి - ముక్తి - మూడింటినందగ
ప్రజలకు చేయూత బడుగులెకద
వారెలేకున్న - ఒక అడుగు వేయలేదు
సంఘమనగ బడుగులే శరణ్యముకద
బడుగు జన సంస్కృతీ-ఉత్తరాంధ్రులమురా
ఎత్తరాజెండ - మనదేను - ఉత్తరాంధ్ర

6) సంపదలు సృష్టించు సార్వభౌములువారు
జగతికి సారధులు బడుగులెకద
ప్రేమానురాగాల దేవత మనతల్లి
ఆదిశక్తికి వీరు తనయులుకద
ఇంటిల్లి పాదికి ఇలలోన బలమిడు
సాధనాలనగను బడుగులేకద
వారు నిలచిన చోట విజయవిహారము
వారిలేనున్న వైభోగమేది
బడుగు జనులదె - దేవదేవి భాగవతము
బడుగువాడు నడిపించినదే భారతమురా
బడుగు జన సంస్కృతీ-ఉత్తరాంధ్రులమురా
ఎత్తరాజెండ - మనదేను - ఉత్తరాంధ్ర

- ప్రజాకవి - వంగపండు

7) హృదయ దుర్బల తది క్షుద్రమనివిడనాడు
ఘన వజ్ర సంకల్ప బలమెవరిది
స్మరణ మాత్రముననే - స్పందించగలిగిన
ఆత్మశక్తినిచాటి ఘనతెవరిది
కర్మలో నిష్కర్మ మర్మమునెరిగిల
ముక్తిమార్గము తెల్పె శక్తెవరిది
దుర్భర దారిద్ర్యదుస్థితి విడనాడ
ఘనస్వయం కృషిసల్పుదారెవరిది
వ్యాస శ్రీకృష్ణ విదురుడు - కర్ణవిభుని
పుట్టుకలజాడె - బడుగుల నట్టే పరచు
బడుగుజన సంస్కృతి ఉత్తరాంధ్రులమురా
ఎత్తరాజెండ - మనదేను - ఉత్తరాంధ్ర

8) రాజులు రైతులను రక్షింతుమనిరాగ
రక్షకా! దండమన "బడుగువాడె"
పెత్తనందారులు - పెద్దజేస్తామనగ
అదిమాభాగ్యమన - "బడుగువాడె"
అగ్రకులధనికులు - ఆదుకుంటామనగ
బ్రతుకులేధన్యమన - "బడుగువాడె"
బొందితో కైలాసమందజేస్తామన
నమ్మిపూజించిన - "బడుగువాడె"
బడుగువాడనగ బల దర్పందన్నుఉన్న
అన్నెపున్నెమభం శుభం చూడలేనివాడు
బడుగు జన సంస్కృతి ఉత్తరాంధ్రులమురా
ఎత్తరాజెండ - మనదేను - ఉత్తరాంధ్ర

- ప్రజాకవి - వంగపండు

9) క్రీస్తు పూర్వమిటన వైదికుల పాలనె
తదుపరె వైదికులు తరలివచ్చి
శాతవాహనలిట సాక్షాత్కరించిరి
అట్టడుగు జాతులన ణచి వేయ
ఆర్యధర్మమిచట - నావిర్భవించగ
వర్ణ వ్యవస్థిట వర్ధిల్లనెంతో
నాల్గవ వర్ణముగ - జాతి శూద్రుల మన
చుల్కనగ - మనలను - జూచినారు
దాసులము - పరిచర్యాత్మ - కర్మమనది
మనమనార్యులం - వర్ణ సంకరుల మాది నుండి
బడుగు జన సంస్కృతీ-ఉత్తరాంధ్రులముర
ఎత్తరాజెండ - ముందుండ - ఉత్తరాంధ్ర

10) పుట్టెడి కష్టాల పుట్టుకలనందేము
సుఖమయి జీవనం దఖలుపడలేదు
కనుమలరణ్యాలె - కనుపించునిచ్చోట
పూటగడవ దెంత పాటుపడిన
మైదాన ప్రాంతాలు మచ్చుకైనను లేవు
గుట్టలు - మెట్టల గుంపులేను
జీవనదులు రెండె నీరెండినవి ఎన్నో
నదుల సరస్సుల జూడలేవు
నాటికాలాన ప్రకృతితో పోరాడినాము
నేటి కాలాన బ్రతుకే పోరాటమయ్యె
శూద్ర జన సంస్కృతీ-ఉత్తరాంధ్రులముర
ఎత్తరాజెండ - ముందుండ - ఉత్తరాంధ్ర

----- ★ -----

- ప్రజాకవి - వంగపండు

# ఉత్తరాంధ్ర

(చరిత్ర-సంస్కృతి)

ప్రధమ భాగము

## 3వ ప్రకరణం - శక్తి భూమి

1) ఆదినుండి - శూద్రు - లగ్రవర్ణాలకు
పరిచర్యసేసెడి - బడుగులెకద
ఫలితమాసించక - పాటుపడితిమికద
తిట్టిన - కొట్టిన - తిరగబడలేదు
కర్మపరులం - మనం - సంపదలు - భాగ్యాలు
కూడబెట్టగ - మనం తోడుకదర
కర్మలు - జ్ఞానమునననుసరించి సాగ
జ్ఞానమే క్రియలకు దారి నిడును.
కృష్ణుడే - మన పుట్టుక - మూల పురుషుడుకద.
భారతం - మన పాలిట - భాగ్యము కద.
కర్మ జ్ఞాన క్రియాశక్తి - తనయులమురా.
శక్తి భూమిది - కళింగాంధ్ర శక్తివరము.

2) జీవుడు - దేవుడు - వేరు వేరనినను
గుడిలోని దేవుని - కొలచినాము
జీవాత్మ - పరమాత్మ - దివ్యాత్మలనగను
ఆత్మలో దైవాన్ని అరసినాము
ప్రారబ్ధ - సంచితాగామి - కర్మలను
కాదనక బ్రతుకును - గడిపినాము
కర్మకధికారివని - జన్మ ధన్యమవగ
ఘనస్వయం కృషిని జరిపినాము
నాస్తి కాస్తిక భావాల గుట్టు నరసినాము
ఆదిశక్తిమాత అమ్మోరు - అఖిలజనని
కర్మజ్ఞాన క్రియాశక్తి - తనయులమురా
జంగమయ్య దీవనలే - శివలింగరక్ష

- ప్రజాకవి - వంగపండు

3) వైదిక మాదిలో - త్రిలింగలో వెలసె
తదుపరి - కళింగకు - తరలివచ్చె
ఆదిశక్తి మాత అమ్మలకు - అమ్మర
ముప్పురమ్మలకీమెమూలమనిరి
లక్ష్మి - సరస్వతి - పార్వతీ - త్రిమూర్తులు
విష్ణు - బ్రహ్మ - మహేశ్వరులుకద.
శక్తి పూజకు - నాడార్యమతమడ్డొచ్చి
పురుష దైవాలిలపూజలందె
వేదమే - పురుష సూక్తము నెత్తి జూపె
ఎంత జెప్పమనం శివశక్తి వీడలేదు
కర్మజ్ఞాన క్రియాశక్తి - అమ్మశక్తి
జంగమయ్య దీవనలె శివలింగరక్ష

4) ఉమ్మడి పూజల కమ్మని తల్లిని
అమ్మోరె - దేవతను - "బడుగువాడు"
తనపిల్ల పాపలను చల్లగ చూడమని
తల్లిని వేడును - "బడుగువాడు"
ఊరు వాడవాడ ఒక్క ఊపునలేచి
సంబరాలను - జరుపు "బడుగువాడు"
సంఘ పరముగవారు సాష్టాంగపడుదురు
ఎల్లరిని దీవించ వేడుకొనుచు
నాడునేడు ఏనాడు జూడ బడుగులెల్ల
శూద్రసంస్కృతిపరులు - శిరము వంచి
కర్మ జ్ఞాన క్రియాశక్తి - "అమ్మ"అనిరి
"జంగమయ్య" దీవనలె శివలింగ రక్ష

- ప్రజాకవి - వంగపండు

5) ప్రతిపూట - పూజలు జరుపరు బడుగులు
ప్రతి ఏట జరుపును జాతరులను
నిత్యము మదిలోన నిల్పుకొని తమనెల్ల
తల్లి రక్షించమని తలచగలడు
సంబరాలు జరుపు భక్తులు బడుగులు
చిత్తశుద్ధితోడ శివమెత్తి ఆడు
అమ్మశక్తిని వారు నమ్మెతారనగను
అగ్గి నిప్పుల మీద నడవగలరు
భక్తిగల వారి కెల్లను శక్తినిచ్చు
సర్వశక్తి ప్రదాయిని తనయులము
మనము శూద్రులము బహుజనులము కానేకాము
జంగమయ్య దీవనలే శివలింగరక్ష

6) ఆదిశక్తిమ్మోరు బడుగులకు దేవత
శిష్టులకు నాడు హరి దేవుడయ్యె
జాతరలు - పండుగలు - జరుపును బడుగులు
శిష్టులు విష్ణువునుచేరి కొలుచు
హరిదాసులొచ్చారు హరికథలు జెప్పగ
గిరికథలు వినిపించ వీధిపాట
శక్తి మాతను బడుగులు మరువలేదు
విష్ణు పూజను శిష్టులు విడువలేదు
జనన మరణకర్మలకు - మార్గగామి
జంగమయ్య దీవెనలే శివలింగ రక్ష

- ప్రజాకవి - వంగపండు

7) జైన దిగంబరులు తిరగాడిరిచటను
తల్లి దేవత పూజ తప్పలేదు
బౌద్ధ భిక్షుకగణం భోధనల వినినను
తల్లిదేవత పూజ మరువలేదు
శ్రీవైష్ణవులు వచ్చి శ్రీ రంగనీతులన
తల్లిదేవత పూజ మరువలేదు
శైవులిటకు వచ్చి శివుని పూజించమన
తల్లిదేవత పూజ మరువలేదు
తల్లి మన ముపురమ్మల తల్లికదర
ఆదిశక్తి అమ్మోరు మన అమ్మతల్లి
హరిహరాత్మక జగతిని చాటి నట్టి
కర్మజ్ఞాన క్రియాశక్తి తనయుల మర

8) ఇహపరసాధన జీవికి వరమన
ఊకొట్టి తలల నూపినారు
వర్తమాన కర్మ బ్రతుకునకు దన్నన్న
కాదనక చప్పట్లు చరచినారు
పూర్వజన్మకర్మ ఫలితమనుభవ మన
అవుననుచు చల్లగ సాగినారు
మానవ సేవను దైవసేవయనిన
మంచిదేయని – మారుపలికినారు
ఎందరెన్ని విధాలగ – జెప్పచెవినివేయ
అందరికి వందనాలను శూద్రులమర
కర్మజ్ఞాన క్రియాశక్తి – ఆదిశక్తి
జంగమయ్య దీవనలే – శివలింగరక్ష

– ప్రజాకవి – వంగపండు

9) నోములు పండించ నూకాలమ్మగ
అనక పల్లిలోన ఉనికినందె
పసిడి రాసులనిచ్చు పైడమ్మతల్లిగ
విజయనగరాన విజయమందె
చల్లని దీవెనల పోలమ్మ తల్లిగ
పల్లె శంబరలోన ప్రతిష్టనందె
కోరికలను దీర్చు కొత్తమ్మ తల్లిగ
ఘన పలాస నందు ప్రస్తుతిగొనె
మంత్రశక్తులు - అమ్మోరవ తారికలివె
శక్తిభూమి - మన ఉత్తరాంధ్ర - శక్తి గలది
కర్మజ్ఞాన క్రియాశక్తి - బడుగులమురి
జంగమయ్య దీవనలే - శివలింగరక్ష

10) కరచరణాలవి కదిలి మెదలాలన్న
కనికరించాలి మన ఆదిశక్తి
నోటపలకాలన్న మాట వినాలన్న
కదలిరావాలి మన అంబ శక్తి
చూపునివ్వాలన్న రూపునందాలన్న
మేలుకొల్పాలి మన దివ్యశక్తి
సుఖమునందాలన్న శుభము కలగాలన్న
సహకరించాలి మన ఆత్మశక్తి
జన్మ మృత్యుజరావ్యాధి - కష్టాలనుండి
బయటపట మనల రక్షించు అమ్మశక్తి
కర్మ జ్ఞాన క్రియాశక్తి తనయులమురి
శక్తి భూమిది - కళింగాంధ్ర - శక్తివరము

- ప్రజాకవి - వంగపండు

11) ఆదిశక్తిమాత - అమ్మోరు - సంస్కృతి
ఒక తల్లి ఒడె మనవూరు వాడ
జనపద సంస్కృతి - బడుగుల సంస్కృతి
పుడమి సంస్కృతిచట పుంజుకొనియె
మనకు దీవనలిచ్చు - అయ్యవారలనగ
జననమరణకర్మ జరుపు జంగములె
శివలింగపూజారి సిద్ధుడు జంగము
అమ్మవారి పూజకట్టడుగువాడె
వృత్తులవి - జీవనా వృత్తులు త్రోవలనగ
పుట్టుకలో హెచ్చు తగ్గులు పుడమిచాయ
కర్మజ్ఞాన క్రియాశక్తి - తనయులమురా
శక్తి భూమిది -కళింగాంధ్ర - శక్తివరము

12) ఆదిశక్తి మాత - అమ్మోరు బిడ్డలం
పూటబత్తెపు గ్రహపాటువద్దు
ప్రాణశక్తి నిచ్చు పరమాత్మ తనయులం
బ్రతికిన చాలునని - భ్రాంతివద్దు
జ్ఞానశక్తి నిచ్చు - జగదాంబ పుత్రులము
మూలబడితిమని - మూల్గవద్దు
కర్మశక్తినిచ్చు తల్లికి సుతులము
పరుల దీవనలకు పరుగులొద్దు
కర్మజ్ఞాన క్రియాశక్తి - కళింగ భూమి
పరుల అడుపాజ్ఞలకు - నిది కట్టునడదు
కర్మజ్ఞాన క్రియాశక్తి - తనయులమురా
శక్తిభూమిది - కళింగాంధ్ర - శక్తి వరము

----- ★ -----

- ప్రజాకవి - వంగపండు

# ఉత్తరాంధ్ర

(చరిత్ర-సంస్కృతి)

**ద్వితీయ భాగము**

**1 వ ప్రకరణం - రైతు బిడ్డలు**

1) జల సంపదలు వృధా అవుతున్నిచ్చట
ఆనకట్టలు లేవు ఆపలేరు
ఉత్తుత్తి మార్పులతో ఊరేగటం తప్ప
ఉపకరించిని రీతినూసులేదు
అంకెల గారిడితో అభివృద్ధి సాధ్యమా
మౌలిక వసతుల కల్పనేది
శాంతి భద్రతులను చక్కబెట్టకుండ
ఆర్థిక స్థితిమనకు మెరుగుపడున
వట్టి - గొప్పలు - ప్రచారం పట్టైదన్నమిడున
భాగ్యనగర ఘందుబాటులో మనకులేదు
కేకవేసిన నగరానికి సోకదుకద
రైతుబిడ్డల - కాకలి - తీరలేదు

2) బొబ్బిలిలో పరిశ్రమల నుద్ధరిస్తామని
గ్రోత్‌సెంటర్‌ది గోతికెల్లె
అడవి పంటలెన్నో మనకు లభించిన
మన్యమున పరిశ్రమ మాటలేదు
ఉత్తరాంధ్రలోన ఊళ్ల సంఖ్యాకము
ఏక నగర విశాఖ వైభోగమేకద
పల్లె చదువరులెల్ల పట్టుదల శ్రద్ధతో
బడి చదువు చదవ బ్రతుకులేదు
తుమ్మితే ఊడిపడినవి ఉద్యోగములట
చదవటం రాయడం వస్తే చదవరులట
గొప్ప బ్రతుకేది బ్రతకటం గొప్పకాదు
రైతుబిడ్డల - కాకలి - తీరలేదు

- ప్రజాకవి - వంగపండు

3) ప్రభుత్వ రంగమును పక్కాడగొట్టారు
ప్రైవేట్ రంగమును పైకి ఎత్తి
పెట్టుబడుల కొరకు పెద్దలను పట్టేరు
సంస్థలకే లాభాలు ప్రజలకేవి
లాభార్జనలులేని ప్రభుత సేవలెకద
సమ సమాజానికి దారినిడును
ప్రభుత్వ స్థలాలవి పదిమంది మేలుకే
దళితులకు బడుగులకు దక్కవేమి
ప్రజల ఉమ్మడి ఆస్తులను అమ్మజూపె
ప్రభుత్వ ప్రజల సంక్షేమ మునగ నిదియ
తలకు మించిన అప్పులు తప్పుకాదె
ముప్పుతిప్పలుత్తరాంధ్రకు తప్పలేదు

4) కోస్తాంధ్ర మాదిరి కాస్తయిన మాసార
నిధుల మంజూరులను నిలిపినారు
నేడు తెలంగాణ విడిచి పోగలనన్న
భూరి నిధులనిచ్చి భుజ్జగింప
ఉత్తరాంధ్రలోన కొత్త ప్రాజెక్టును
ఒక్కటి చెప్పండి మీ ప్రక్కమేము
ఇచట మీరు పెట్టె పెద్ద పరిశ్రమను
తెలపండి మీకెదురు చెప్పబోము
మూల సంస్కరణలు చేపట్ట మూగనోము
ప్రజల ఆర్థిక స్థితగతులదు గంటినేడు
చిల్లర పనుల పథకాల చిందులాట
రైతుబిడ్డల – కాకలి – తీరలేదు

– ప్రజాకవి – వంగపండు

5) ఒకరి నెన్ను కొనుచు ఓటిచ్చి బ్రతికెడి
దళితులు బడుగులు కలరు ఇచ్చోట
తామెన్నుకొంబడు మాటనే మరచారు
ఓట్లు పేరివి పదవులొకరివాయె
అగ్రకుల ధనికులు అందల మెక్కారు
బలహీను లెల్లరు భంగపడిరి
చదువు నమ్ముకొనెడి సంస్థలు వెలసాయి
చదువును కొనమని పాఠాలు సెప్ప
బహుళ సంఖ్యా బలీయులు బడుగులెకద
అట్టడుగు నభాగ్యపరులు దళితులెకద
బ్రతకదలచిన వీరికి బ్రతుకులేవి
ముప్పుతిప్పలుత్తరాంధ్రకు తప్పలేదు

6) ఆర్థిక సంస్కరణలంగడిని పెట్టారు
కొనగలిగి నోడికే కోరినంత
ఆర్థిక సమానత అటకెక్కిపోయింది
బలమున్న వాడిదే భాగ్యమనిరి
సమసమాజమనెడి మాటయే వినబడదు
ప్రతిభ సమర్థతకు పదవులేవి -
బడుగులు - దళితులు - బలహీనులకద
బక్కబలములేదు - పిక్కలేదు
తైలమే లేకవత్తి నెగవేయనేమి ఫలము
వెలుగ ప్రమిదలో పసలేదు కదర
ప్రజల బాగును పెంచెడి పద్ధతులివా
రైతుబిడ్డల - కాకలి - తీరలేదు

- ప్రజాకవి - వంగపండు

7) ప్రభుత్వ సంస్థల పళ్లాడ గొట్టారు
వ్యక్తి సంఘాలకు శక్తినిడిరి
న్యాయమైన పనికి న్యాయమగు వేతనము
ప్రభుత్వ సంస్థలలో సాధ్యముకద
ప్రైవేటు సంస్థలలో వేతనాలనంద
తగిన రక్షణలేవి తన్నులాటె
పబ్లిక్ రంగము పతనమైననాడు
ప్రైవేటు సర్వము కాటువేయు
గృహ పరిశ్రమ లెల్లను నేడు కూలిపోయె
తిండిలేకను నేత పనివారు తిరిపమెత్తె
పేదబీదలను కాపాడని పద్దతేల
ముప్పుతిప్పలుత్తరాంధ్రకు తప్పలేదు

8) రైతోడు బాగుపడ - రాజుల నెదిరించె
నెహ్రూ సోషలిజమె - నేడు దిక్కు
కార్మికుడు - బాగుపడ - ప్రభుత్వరంగమనిన
నెహ్రూ సోషలిజమె - నేడు దిక్కు
ప్రైవేటు - పబ్లిక్ సంస్థలైక్యపడగ
నెహ్రూ - సోషలిజమెనేడు దిక్కు
సంఘ సంక్షేమము సంధాన కర్తను
నెహ్రూ సోషలిజమే - నేడు దిక్కు
సంస్థలవి రెండు నేత్రాలు ప్రగితినిచ్చు
రెండురంగాలు - సరిసమాన - రక్షణలిడు
ఒంటికన్ను - చూపుమనకేముపకరించు
ముప్పు తిప్పలు - ఉత్తరాంధ్రకు - తప్పలేదు

- ప్రజాకవి - వంగపండ

9) ప్రైవేటు రంగమే ప్రజలకు మేలన
"కప్పకు" పాము కాపిడుటకాదె
ప్రైవేటు సంస్థలతో పెరుగునభివృద్ధన
"గాబు" వరిమొనకు వరమనుటయేను
సంపన్నులెల్లరును సంఘహితులే యన
"వేప" తీపినిల నిచ్చుననుటె
ఉన్నోళ్ళు పేదోళ్ళ నుద్ధరిస్తారన
"వృక్ష" నీడలో మొక్క పెరుగుననుటె
ఒకరు రక్షింతురనుమాట వట్టిమాట
ఉద్ధరేదాత్మనాత్మాన మువాచగీత
ఏబదేండ్లుగ మన బ్రతుకు లేమిమారె
రైతుబిడ్డల - కాకలి - తీరలేదు

10) కూడ బెట్టిన నిధులు తోడుగనుండగ
గడపదాటక మాటలాడువారు
కుల వ్యవస్థలోని కుళ్లులో కాలిడి
భేదములెందుకని తెలుపువారు
పదవులును భాగ్యాలు తమ ఒడినిచేరగ
ఏమి శాశ్వతమని చెప్పువారు
ఏ.సి. రూములలోన బాసులుగ తాముంటు
సమ సమాజ మనుచు చాటువారు
ఏ ఒకరు నీకు చేయూత నివ్వబోరు
నీవె కర్మాధికారివని తెలిపెగీత
పరులపై ఆధారపడి బ్రతుకవద్దు
ముప్పుతిప్పలుత్తరాంధ్రకు తప్పలేదు

- ప్రజాకవి - వంగపండు

11) స్వరాజ్యమె లభించ స్వతంత్రులం మేమని
చిల్లరపార్టీల్లో చేర దీసితిమి
ధనిక పార్టీలకు, స్వాగతమందించి
సామ్యవాదము మరచి, సంచరించితిమి
నిత్యవిమర్శలతో - నిలచితిమే తప్ప
సత్ఫలితాల్ని మనమందలేదు
ఎదిరించివారినెదిరించ నేర్చితిమి
మన ఇంటి సంగతిని మరచినాము
ఉత్తరాంధ్ర గత పరాజిత దురదృష్టమిదియె
కళింగాంధ్ర గత విరాజిత - అదృష్టమిదియె
కొసముగల ఉత్తరాంధ్రకు కొసరనేడు
ముప్పుతిప్పలుత్తరాంధ్రకు తప్పలేదు

12) వీర తెలంగాణ వేరని గర్జించ
దేవాదికి పునాది వేసినారు
సీమవాసు లెల్ల సింహనాదము చేయ
తెలుగు గంగకు త్రోవనిచ్చినారు
సర్కారువారెల్ల సంఘటిత మవగను
భారీ ప్రణాళిక చేర్చినారు
ఉత్తరాంధ్ర వాసి ఎంతమొత్తుకున్న
ఒక్క ప్రాజెక్టు ఊసేత్తలేదు
ఎంత అరచిన నూతిలో పిలుపు మనది
పెడచెవిని బెట్టి మనకేమి చేయలేదు
ముప్పుతిప్పలుత్తరాంధ్రకు తప్పలేదు
ఎత్తరా జెండ ప్రగతి సాధనకుత్తరాంధ్ర



- ప్రజాకవి - వంగపండు

# ఉత్తరాంధ్ర

## (చరిత్ర-సంస్కృతి)

## ద్వితీయ భాగము

### 2వ ప్రకరణం - ఇంటి పెత్తనం

1) ఉద్యమశక్తికి కొదవలేదిచ్చట
ఉద్దండనాయకులూరూర గలరు
ధైర్య స్థైర్యౌర్యాలకు పేరుపడి తిమిమనం
వెనుకడుగు వేయని వీరులమురా
సహజ వనరులెన్నో సాక్షాత్కరించినవి
భూగర్భ నిధులు గల భూమిమనది
పసిడి పంటల దాత రైతాంగమున్నది
కష్టించి పనిచేయ కార్మికులుకలరు
ఇన్నివనరులు మనకున్న బాగేదిసున్న
ఇరుగు పొరుగులవారిట తిష్టవేసి
ఇంటి పెత్తనం ఇతరులకివ్వబోము
ఊరి పెద్దరికం - మనదె - ఊరుమనదె

2) కమ్మగా బ్రతకగ నిమ్మగ నిటకొచ్చి
మనల నేలెడి మారాజులైరి
పైసపరక ఇచ్చి పసిడి పొలాలను
వలస వచ్చినవారే వశపరచుకొనిరి
బయట శక్తులొచ్చి బలబడిన విచటను
మనలను బానిసగ బందిచేసి
అక్రమార్కులెల్ల విక్రమార్కులైరి
చక్రము త్రిప్పుచు సాగిరిచట
ఇంటి పెద్దరిక మితరులకిచ్చినపుడు
ఎంతపాటు పడిన మనకేమిదక్కు
ఒరుల పెత్తనము మనకేమి ఒరగబెట్టు
ఊరుపెత్తనం పరులకా ఒప్పుకోము

- ప్రజాకవి - వంగపండు

3) నీ ఇంటి ప్రక్కనే నిలచి పారునుకథ
నాగావళి వంశధార నదులు
నీ ఇంటి కెదురుగ నిలచెరేవులెన్నో
కళింగ, భీమిలి, గంగవరము
నీ ఇంటి ముంగిటనే నిలచునడవి సిరులు
అరకువాల్పాడేరు చింతపల్లి
నీ ఇల్లు బంగారమన నిలచునెల్లెడల
గరివిడి గర్భాము గనులవెన్నో
సహజసంపదల ఉత్తరాంధ్ర సతికిలపడె
ఓడరేవులు నదులతో కూడియున్న
ఉత్తరాంధ్ర ప్రజలకుపాధి ఏది ?
వట్టిగొప్పలు - చెప్పొద్దు - ఒప్పుకోము

4) ఉత్తరాంధ్ర గలవు గొప్పరేవులెన్నో
సాగరం వర్తకం సరిగలేదు
భీమిలిరేవది ఏనాటిదో ఇది
భావన పాడది భంగపాటు
గంగవరము పోర్టు గతిలేదిప్పటికి
కళింగ రేవది కాంతిబాసె
ఓడరేవు విశాఖ ఉన్నదొకటిమనకు
మిగిలిన రేవులు పొగచూరుబట్టె
ఎన్నో రేవులు మత్స్యకారులకన్నమేది !
జలధి సంపదలు రైతులకు బలమదేది
సొంత, ఇంటి బాగొనర్చ మనవంతు కదర
పరులపెత్తనమున మన ఇల్లు బాగుపడునె !

- ప్రజాకవి - వంగపండ

5) ఉక్కునగర విశాఖ ఉత్తరాంధ్రలో ఉంది
ఉద్యోగవసతులు హొంతక్కె మనకు
జీవనదులుపారె త్రోవరామనగడ్డ
నీటికై మన రైతునింగి జూచె
అటవిక సంపదలన్ని ఇన్నికావు
గిరిజనులు బ్రతుకులో వెలుగులేదు
భూగర్భగనులెన్నో ఊరూరనున్నవి
వెలికి తీయనిట నిధులకొరత
ఏబదేండ్ల పాలనలో మనకే మిదక్కె
కూడు గూడు గుడ్డలకు కొరతకలిగె
సొంత ఇంటిని బాగొనర్చ - పంతమూను
ఊరుపెత్తనం పరులకా! ఊరుకోము.

6) గృహవృత్తిదారునికి నడివీధి బ్రతుకాయె
సాంప్రదాయక వృత్తిసన్నగిల్లె.
పనిపాట్లు చేసిన పరిశ్రమలో దూరిన
కడుపు కన్నము లేదు కార్మికునకు
ఉమవులు భూలను నడుమొంచి చేసిన
ఫలితమందని వ్యవసాయకూలి
హాంముసుచేపట్టి పొలమునుదున్నిన
కలిమిలేకనుండె కర్షకుండు
పెట్టుబడు లేవి బ్రతుకులు గట్టిపడగ!
అప్పులను తీర్చమన శ్రమలు ఆవిరయ్యె
పరుల ధీనమున బ్రతికిన బ్రతుకులింతే
ఇంటిపెత్తనం ఇతరులకివ్వబోము

- ప్రజాకవి - వంగపండు

7) మా ఇంట బుట్టాయి రాజకీయాలని
రాజులు - మనలను వదలలేదు
మావంశ గోత్రాలు మహదొడ్డవియని
పెద్దోళ్ళు పదవులు వీడలేదు
మాకులమే బలమని పరులొస్తేకుదరదని
కుర్చీని పట్టుకొని తొలగలేదు
పది మంది బ్రతకగమదుపు దార్ల మనెడి
జననాయకుల పోరు ఆగలేదు
వీరు ఏవ్వూరివారైన - ఆవ్వూరుపాడు
గ్రామ స్వరాజ్యం - మనకు కావాలినేడు
ఇంటగల మనమె - మన ఇంటి పెద్దలమురా
ఊరుపెత్తనమ్మనది -మన ఊరు మనదె

8) ఉత్తరాంధ్రలోన - ప్రతి ఒక్కనగరాన
ఉన్నతపదవుత్తరాంధ్రునిదిర
అప్రకటిత - కళింగ - రాజధాని - విశాఖ
ఉన్నతస్థానముత్తరాంధ్రునిదిర
పరులొచ్చిఇచట - పదవులలోనుండ
ఇటునున్న వారికింటిపనులె
అయినవారికి కూడు ఆకులలోనిడి
కానివారలకు - కంచాలలోన
నెత్తి కెక్కి కూర్చున మనమేమి సేవకులము
ఉత్తరాంధ్రమనసొత్తు - ఉత్తరాంధ్రులమురా
పరులకా ఇంటి పెత్తనం - పనికిరాదు
ఇంటి పెత్తన మితరులకివ్వ బోము

- ప్రజాకవి - వంగపండు

9) పరుల పాలనలోన - ప్రతిపల్లెలో జూడ
పల్లెలు గుల్లలై పట్నమెల్లె
పైసలున్నమేమె - ప్రతిభకలవారమున
పెద్దతనము పీడెపల్లె నుండి
మిడిమిడి జ్ఞానము - నడివీధి - తిరగాడ
పల్లెను విడనాడె - పండితుండు
పై సగుంజినోళ్లు - పల్లె నాయుకులయ్యె
ఉత్తములస్థానము చెత్త బుట్ట
వయసు - విజ్ఞానమనుభవం వట్టి పోయె
కమ్మగా బ్రతికి నోళ్లెల్ల బ్రహ్మ లాయె
ఉత్తరాంధ్ర ప్రగతి సాధన - కద్దుకట్ట
ఒరులపాలనా- ఇచ్చట- ఊరుకోము !

10) స్వస్థలము - ప్రాంతము - విస్మరించబడవు
నేలను నిలబడక - నింగికనబడదు
చచ్చిసాధించెడి - స్వర్గము కన్నను
పుట్టిన ప్రాంతమే పుణ్య ప్రదము
ప్రగతి దోహదకారి - ప్రాంతీయ పార్టీయని
మా ప్రాంతమునగను - మండిపాట
అ ప్రకటిత విభాగాలాదినుండున్నవి
చెరిపేయజూడనవి చెరగబోవు
తెలంగాణే నాడు జేరలేదాంధ్రలోన
ఆంధ్రదేశమున అభ్యంతరం మాకులేదు
పేరుబడినది - ఉత్తరాంధ్ర - చరిత్రలోన
ఇంటి పెత్తనం ఇతరులకివ్వబోము

- ప్రజాకవి - వంగపండు

11) యంత్రాలదెచ్చిరి - వస్త్రాలనేయగ
చేనేత గాళ్ల కవిచేరలేదు
యంత్రాలతోడనే వ్యవసాయమన్నారు
చిన్నరైతులకవి చిక్కలేదు
యంత్ర జగతిది వస్తు నిర్మాణ మన్నారు
చేతివృత్తుల సరి చేయలేదు
యంత్రాలతోడనే - పనిపాట్లు జరపగ
పల్లె పనివాళ్లకు - పనులు లేవు
గుడిసెలో నివాసాలు - తడికె బ్రతుకు
దినము గడవక చేత నొకపైసలేదు
పల్లె ఆర్థిక వ్యవస్థనే గుల్ల పరచె
పరులకా ఊరు పెత్తనం - ఊరుకోము

12) ఉత్తరాంధ్ర మనది - గొప్ప శక్తులు కలది
పరులొచ్చినీతులు నేర్పవద్దు
ప్రతిచోటనూగలరు - ప్రతిభా సమన్వితులు
పరులొచ్చి పాఠాల్ని పలకవద్దు
సిరిసంపదల తల్లి - వరపుత్రులము మేము
పరుల పంచనుబడి - బ్రతకవద్దు
పదవులు - డబ్బులు - కమ్ముడవబోమురా
ఆత్మాభిమానమెమాకాభరణము
ఇచటపుట్టి పెరిగినవారి దీవూరుకదరా
పరులిచటకు వచ్చి బాగుగబ్రతకవచ్చు
ఊరుపెత్తనం - మారదన - ఊరుకోము.
ఇంటి పెత్తనం ఇతరులకివ్వబోము.

----- ★ -----

# ఉత్తరాంధ్ర

## (చరిత్ర-సంస్కృతి)

### ద్వితీయ భాగము

### 3వ ప్రకరణం - ఉపాధి ఏది

1) రైతు బిడ్డలు నేడు రాజులని చెపుతారు
పండించు పంటలకు ధరలు లేవు
మద్దతు ధరలేక కిట్టుబాటు కాక
శ్రమటోడ్చు రైతన్న సాగిలబడె
రాయితీల రద్దు బ్యాంకు ఋణాలేవి
బక్క-చిక్కిన రైతు కెక్కడిదిబాగు
సన్న చిన్నకారు రైతాంగమెల్లను
సాగు హక్కు-లేక సతికిలపడె
రైతుదే రాజ్యమని చెప్పునిదినములేదు
కృషిపరునికే కూడు నీడని పాటపాడు
ఏబదేండ్ల పాలనలో రైతులకేదిబాగు
ఉత్తరాంధ్ర ప్రజలకునుపాధి ఏది

2) చిక్కోలు రైతులకు చిక్కవు సిరులింక
వంశధార ద్వితీయ మొట్టిపోయె
విశాఖ రైతులకున్నవి రైవాడ-తాండవ
జలాశయాల్లో - జలములేదు
విజయనగర రైతు వినాశనమనగను
జన్మకు పూర్తవదు జంఝావతీ
తోటపల్లి బరేజి ప్రాజెక్టు పెదగడ్డ
రైతులనూరించు ఎత్తుగడలే
పోలవరం ప్రాజెక్టుకి పోలికేది !
సాగునీటి- త్రాగునీటికి - కరువుతీర
తల్లి గోదావరీ - మనకు - రక్షరక్ష
ఉత్తరాంధ్ర ప్రజలకు బ్రతుకు తెరువు

- ప్రజాకవి - వంగపండు

3) ఉత్తరాంధ్ర రైతునిత్యము పండించు
చెఱకు పంటకు ఎసరు పెట్టినారు
లచ్చయ్యపేట మిల్లమ్మ కానికివచ్చె,
బొబ్బిలి రైతులకు ముప్పువచ్చె
ఆముదాలవలస చక్కెర మిల్లును
పరుల కప్పజెప్పు పథకమేసే !
భీమసింగ్ ఫ్యాక్టరీ రైతులకు దిక్కేది
ఉన్న చెక్కెర మిల్లుఊడిపోవ !
తుమ్మపాక ఏటికొప్పాక చోడవరము
చక్కెర మిల్లులను చక్కగనమ్మ దలచే
నడపడమే చేతకాని ప్రభుత్వమిదిర
ఉత్తరాంధ్ర ప్రజలకునుపాధి ఏది?

4) భూమి పట్టాలేక దున్నుకొని బ్రతికెడి
పరుల భూములలోన "కౌలుదార్లు"
చిన్న సన్నకారు రైతాంగమే హెచ్చు
చాలినంత భూమి "లేనివాళ్లు"
సాగుబడి చేస్తున్న రైతు పంచజేరి
పూటపనికి తిరుగు "కూలివాళ్లు"
సొంత పొలములుండి అంతగా శ్రమపడక
వచ్చిన రాబడను సాగుదార్లు
ఏ ఒక రైదెకరాల భూమిలేనివారె
ఆధునిక సాగు పద్ధతుల సాధ్యముకద
పాత పద్ధతిలో రాబడిరాదుకదర
ఉత్తరాంధ్ర ప్రజలనుపాది ఏది?

5) వంటి బలముతోడ ఇంటిల్లి పాదిగ
సాగుబడి అనేదొక నాటిమాట
మంత్ర సిరులు జల్లియంత్ర బలమురాక
ఒంటివానిదే వ్యవసాయసాగు
వ్యవసాయ పనులను యంత్రాలెసరిపెట్ట
కూలి రైతులకు కూడు లేదు
పనులేవిదొరకక వ్యవసాయ కూలీలు
పనులకోసం వీరు - పట్నమెల్లాలి
ఉత్తరాంధ్రలో పరిశ్రమల ఊసులేదు
చెప్పుకొనగనొక ఫ్యాక్టరీలేదు ఇచట
రెంటికీ చెడి ఇలనున్న రైతుబిడ్డ
ఉత్తరాంధ్ర ప్రజలనుపాధి ఏది?

6) సారవంతమైన సాగు భూమికలదు
పేరుకొకటి లేదు నీటి సాగరము
ముడి సరుకులిచ్చెడి మడులు మాన్యాలున్న
వినియోగపరచ-యంత్రాలు కొరత
కొండ కోనలలోన దండిగానదులెన్నో
అడ్డుకొనిఆపు ఆనకట్టలేవి
నదుల జలాల నడ్డగించలేక
నీటి గుంటల కొరకు దేవులాట
ప్రాలబత్తెము నిడు పథకాల జోరులేను
కూడు పెట్టగల ఘన నీటి ప్రాజెక్టులేవి
దండిగను జలసంపదలున్న- దక్కలేదు
ఉత్తరాంధ్ర ప్రజలనుపాధి ఏది?

- ప్రజాకవి - వంగపండు

7) పల్లెలలో నేడున్న - పరపతి సంఘాలు
భినామీ రుణాల చిల్లు - చిట్టాలు
వడ్డీ వ్యాపారులతే - రైతులకు - దిక్కయ్యె
నెలవారీ వడ్డీలు - నలిగిపోయె
బ్యాంకు రుణాలు - రైతుకందలేదు
వ్యవసాయ ఋణాలు - వట్టిపోయె
వ్యవసాయ మదుపులు - అన్ని ఇన్ని కావు
పండించు పంటలకు ధరలులేవు
రైతులకు ఆత్మహత్మలే శరణ్యమయ్యె
పూటకొకరైతు - ప్రాణము నీటగలిసె
రైతు ఋణ విమోచన చట్టం చేయబోరు
ఉత్తరాంధ్ర ప్రజలనుపాధి ఏది?

8) అమ్మకం పన్నులు మార్కెట్ పన్నులు
అభివృద్ధి పన్నులు పన్నులెన్నో
పండించినందుకు ఫలితము శూన్యమే
సాపాటుకరు వైన బ్రతుకుతనది
ఉత్పత్తి శక్తులు రైతులని తెలియదా
ఉచిత విద్యుత్తు నివ్వరేల !
ఎవడబ్బ సొమ్మిది రైతు కష్టమెకద
ఉత్పత్తిదారుని దే ఉర్వి బలిమి
రైతులకు వడ్డీలేని ఋణం ఇవ్వరేమి
పంటలకుచిత విద్యుత్తన పలకరేమి
రైతు ఋణాలనెల్లను రద్దు పరచరేమి
ఉత్తరాంధ్ర - రైతుకు పాధి చూపరేమి?

- ప్రజాకవి - వంగపండు

9) ఎప్పటిదో జంఝావతిప్పటికి గతిలేదు
అడ్డంకులటమీ అధికారమేల
వంశధారనేడు శని పట్టినిలచింది
చేసిన ఋణాల్నెచట పెట్టినారో
పెదగెడ్డ ప్రాజెక్టు! ఏది తారకరామ !
హామీల పట్టికలు - వట్టివేన !
స్రెక్ - జంఝావతికి దిక్కు-లేని స్థితి
తోటపల్లి బ్యారేజితోపులాట
ఎంతకాలము - రైతులనేడి పిస్తు
ఏలికలు - గద్దెలపై నిలువగలరు
ఆగ్రహించిన - రైతాంగ మడ్డలేరు
ఉత్తరాంధ్ర రైతులకుపాధి చూపరేల ?

10) హెక్టారు భూమియు ఏ ఒకరి కుండదు
చిన్న సన్న రైతుచిక్కి- పోయె
ఉత్తరాంధ్ర ప్రజకు వ్యవసాయమే దిక్కు-
పూట బ్రతుకునకు లోటుకలిగె
ఇప్పటికి గ్రామాల్లో పెత్తనంబొకరిదే
కూలి రైతుకి నేడు కుందాడలేదు
అసమానతులు నేడు బుసకొడుతున్నాయి
పేదోళ్ళు గొప్పోళ్ళు పెరిగినారు
దున్నుకొన చాలినంత భూమిలేని వాళ్లు
చిన్న రైతులు పెట్టుబడి పెట్టలేరు
అధిక, ఉత్పత్తుల నెలా వృద్ధి పరచగలరు
ఉత్తరాంధ్ర ప్రజలకుపాధి చూపరేల !

- ప్రజాకవి - వంగపండు

11) ఒకచో ధవళేశ్వరంబుప్పొంగి పారును
రైతులకు - సిరినిచ్చు దేవతనగ
ఒకచో - శ్రీశైలం - హోరని పరుగెత్తు
ఎల్ల రైతాంగం - తల్లియనగ
ఒకచో నాగార్జునమొక పెద్దసాగరం
రైతులనుపాలించు రాజు అనగ
ఒకచో కె.సి. కెనాల్ - ఒయ్యారమునసాగు
పసిడి పంటపొలాల రాణి యనగ
ఏబదేండ్లు గతించె కళింగకేది ఒకటి !
ఒక్కనదీ ప్రాజెక్టుకు - దిక్కులేదు
నిలచిపోయిన - ప్రాజెక్టులేనేడు గలవు
ఉత్తరాంధ్ర - రైతుకుపాధి చూపరేమి !

12) ఊరు చివరున్నాము - ఉత్తరాంధ్రమనది
చివరికి చిక్కిన దేమిలేదు
రైతుల స్థితిగతులు రాణించలేదిచట
పోరాటములతోడ - ప్రొద్దుగడిచె
ప్రగతి సాధనకు - ప్రణాళికలు వచ్చిన
అమలుపరచజూడ అల్పమిచట
గద్దెలపై నున్న - ఘనులముమేమన్న
ఉత్తరాంధ్ర - రైతు - మురిసిపోడు
నేటి రైతులొకనాటి నిశానీలుకారు
గాను గెద్దులా - మీచుట్టుగడపబోరు
గంగిరెద్దుల -తలలనాడించబోరు
ఉత్తరాంధ్ర - ప్రగతిసాధన శక్తిపరులు !

----- ★ -----

- ప్రజాకవి - వంగపండు

# ఉత్తరాంధ్ర

(చరిత్ర-సంస్కృతి)

**తృతీయ భాగము**

## 3వ ప్రకరణం - కళింగ - త్రిలింగ

1) ప్రాచీన కళింగ యర్వాచీన త్రిలింగ
ఆదినుండొకటిగ కలిసి లేవు
అటనిటగల వారాంధ్ర జనులేయైన
అనబడె కళింగ త్రిలింగలనగ
ఏకజాతి తెగల మెల్లర మాంధ్రులం
కుల వర్ణ సంస్కృతుల కూడలివిర
మాతృస్వామ్యమిట పితృస్వామ్యమచట
నెలకొని చరించ నిలచినాము
వంశధార - నాగావళీ - కళింగ మొకటి
కృష్ణ-తుంగభద్ర-గోదావరీ-త్రిలింగమొకటి
అందరం-ఆంధ్రుల మొంటిమి - రెండుచోట్ల
ఆంధ్రజనని - తెలుగుతల్లి మన ఆత్మకదర.

2) దక్షిణ భారతికి - దగ్గర త్రిలింగ
ఉత్తర భారతికి దరిని కళింగ
దక్షిణ గోదావరుత్తర మహేంద్రగిరి
మధ్య భూభాగమే - మన కళింగ
నాటి కళింగ - త్రిలింగ - మధ్య - సరిహద్దు
భీమేశ్వరాలయం - నిలచియుండు
కాళహస్తీశ్వరుడు - మహిమల్లికార్జునుడు
త్రిలింగ - దక్షిణ - పశ్చిమలు
త్రిలింగ - సర్కార్ - రాయలసీమకదర
ఘన కళింగ - నేటి మన ఉత్తరాంధ్రకదర
దరిమిలా కలిసె - తెలంగాణాంధ్రలోన
ఆదినుండి వేర్వేరు - భూభాగము లివి

- ప్రజాకవి - వంగపండు

3) బడుగులు దళితులు బహుసంఖ్యలిచ్చోట
అగ్రకుల ధనిక విన్యాసమచట
అజ్ఞాన దరిద్రత కనిపించునిచ్చోట
విజ్ఞాన సౌభాగ్యసిరులు అచ్చోట
ఉత్తుత్తి పథకాల ఊరింపునిచ్చోట
భారీ పరిశ్రమల జోరు అచ్చోట
మెట్టలు గుట్టలు నిలచి జూడిచట
పచ్చని మైదాన పంటలచ్చోట
రంగు వెలసిన రాజకీయ కళింగ మనది
పండిన జన స్వామ్య సరణి త్రిలింగ కదర
కలిమి గలది త్రిలింగ కళింగకేది !
మన కళింగ - త్రిలింగ కథలువేరు

4) మన కళింగలో జూడ కచ్చారహదార్లు
త్రిలింగలో గలవు సిమ్మెంట్‌రోడ్లు
ఊరికొక కళాశాల ఉందిర త్రిలింగలో
మండలానికొకటి మనకులేదు
నీటి వనరుల సాగు నిలయం త్రిలింగర
నీటికోసమే జూచునింగిని కళింగ
ఆరు జిల్లాలలో అతిభోగి త్రిలింగ
మూడు జిల్లాలతో మూల్గును కళింగ .
మనం ఏక తెగలమే మన ప్రాంతాలువేరు
కలిసి బ్రతుకుట కష్టము కథలేవేరు
కలిమిలేములు ఒకరీతి నడవలేవు
మన కళింగ త్రిలింగాంధ్ర కథలువేరు

- ప్రజాకవి - వంగపండు

5) నష్టపడె కళింగ లాభపడె త్రిలింగ
కలిసి నడవలేవు నష్టలాభాలు
మెరుగుపడె త్రిలింగ మరుగుపడె కళింగ
చీకటికి వెలుగుకు, చెలిమి కుదరదుర
బాగుపడె త్రిలింగ బాధపడె కళింగ
కలిమిలేమొకచోట కలియవుకర
అక్షరాస్య త్రిలింగ - నిరక్షరుల కళింగ
సమరీతి అడుగేయ నసాధ్యముకర
ఉత్తరాంధ్రులు దక్షిణాంధ్రులన్నదమ్ములైన
ఉనికి స్థితిగతులనొకచోట పొందలేదు
పేరు ఒడితిమి వేరువేరు చరిత్ర మనది
మన కళింగ త్రిలింగాంధ్ర కథలువేరు

6) కళింగపల్లెలు దారిద్ర్యఛాయలు
త్రిలింగ పల్లెలు శ్రీ తోరణాలు
బక్కచిక్కిన వారి బ్రతుకులే కళింగ
పిక్క వస్త్రాదులు ఉక్కుర త్రిలింగ
తిండి కలిగినోడు త్రిలింగ రైతోడు
కడుపు నిండనివాడు కళింగ్రైతు
నిత్య పంటసిరులు నిండియుండు త్రిలింగ
కరువు కాటకాల వరదలు కళింగ
వారు బాగుపడిరన్న బాధ మాకులేదు
మేము వెనుకబడితి మనే ఏడ్పుమాది
బాగు పడగల మర్మ భాగం - మాకునిడిన
పేరు తెలంగాణ - కళింగ - త్రిలింగ మొకటి

- ప్రజాకవి - వంగపండు

7) ఆదివిరాట్పురుషునవతారిక త్రిలింగ
ఆదిశక్తిమాత వేదిక కళింగ
ఋషిమతమె త్రిలింగ రాజ్యమేలినదిర
కృషి మతము కళింగ కూడలికద
మార్గ కవితలకెల్ల మార్గదర్శి త్రిలింగ
దేశ కవితలకు దిక్కు కళింగ
ఆంధ్రభోజుడు కళింగ కానంద గజపతి
కృష్ణదేవరాయ త్రిలింగ విభుడు
మాండలిక పామరుల భాష, కళింగబాస
సంస్కృతీకరణ తెలుగు త్రిలింగ భాష
గ్రంథ భాషగ తెలుగానాడ గద్దెనెక్క
ఆంధ్రమడుగంటె, అమరము నెత్తికెక్క

8) త్రిలింగాధిపతులు - తెరమీద కొచ్చారు
మాది త్రిలింగని - మాట జెప్ప
బహిష్కృతి కళింగపై దండెత్తి వచ్చారు
కడజాతులిచటను. కాపురమని
ప్రాచీన కళింగ - ప్రాభవము గోల్పోవ
మధ్యయుగ - త్రిలింగ - గద్దెనెక్కె
త్రిలింగనేవారు - తెలుగుదేశమనిరి
తెలుగు జాతిగవారుచెప్పుకొనిరి
ఆంధ్రుల మన ప్రాచీనత సంతరించు
తెలుగువారమన ర్వాచీనత సంభవించు
ఆంధ్రజనని - తెలుగుతల్లి - అచటనిచట
మనకళింగ - త్రిలింగ - సమైక్యాంధ్రద్వయమె



- ప్రజాకవి - వంగపండు

# ఉత్తరాంధ్ర

## (చరిత్ర-సంస్కృతి)

## తృతీయ భాగము

### 1 వ ప్రకరణం - గొప్పవాళ్ళు

1) ఆంధ్రభోజుడు మన ఆనందగజపతి
ఆస్థాన పండితులకద్భుతవరం
ఆంధ్రభాషను కళల నాదరించిన వాడు
ఆంధ్రోదయానికి ఆధ్యుడితడె
విజయనగరమును విద్యల నగరమన
తీర్చిదిద్దినట్టి నేర్పరితడు
ఆంధ్ర సంస్కృతి దీపమారిన సమయాన
తిరిగి వెలిగించిన దినకరుండు
విజయనగర సంస్థాన భూవిభుడింతడు
సద్గుణుడు మహనీయుడు ప్రఖ్యాతిపరుడు
ఉత్తరాంధ్రకే పేరు తెచ్చిన గొప్పవాడు
ఎత్తరాజెండ మనదేను ఉత్తరాంధ్ర

2) బొబ్బిలి రంగరావ్ జబ్బకొట్టి చరచి
నాన్ బ్రాహ్మణోద్యమం నడపినాడు
ఉమ్మడి - మద్రాస్ - ఇమ్మహిని కొనసాగ
ప్రీమియర్ పదవిచే పట్టినాడు
వెనుకబడినవారి వెలుగు దీపమితడె
కమ్యూనల్ జి.వో.కి. కారకుండు
జస్టిస్ పార్టీకి జన నాయకుండయి
చేయగలిగిన సేవ జేసినాడు
దక్షిణాధిలో ఉత్తరాంధ్రకు దారి ఇతడె
బడుగులకు చేయూత నిచ్చిన రాజ ఇతడు
ఉత్తరాంధ్రకే పేరుతెచ్చిన గొప్పవాడు
ఎత్తరాజెండ మనదేను ఉత్తరాంధ్ర

- ప్రజాకవి - వంగపండు

3) తెల్లవారి హృదిలో బల్లెము అల్లూరి
విప్లవాగ్ని జ్వాలవీరుడితడు
రాజులింట బుట్టి రాజ్యాల్ని కోరక
జనులనుద్ధరించె ప్రగతిపరుడు
విల్లంబుల ధరించె తెల్లవాళ్లనెల్ల
వెళ్లగొట్ట సాహసించినాడు
కొండమీద పంట కోయదొరలదనె
దోపిడీదార్లను తోలగగొట్ట
దేశ స్వాతంత్ర్య సాధనకు అసువులిచ్చె
జాతి పౌరుషమును నిల్పిననేతకదర
ఉత్తరాంధ్రకే పేరు తెచ్చిన గొప్పవాడు
ఎత్తరాజెండ మనదేను ఉత్తరాంధ్ర

4) బొబ్బిలి పౌరుషం బెబ్బులిని తలపించు
తాంద్రపాపారావు మనకు సాక్షి
ఉత్తరాంధ్రలోనితడు గొప్పవీరుడనగ
బరి తెగించి వచ్చెరణమొనర్ప
నిస్సహాయుడైన నిబ్బరముగ వచ్చి
యుద్ధగుడారమున నిద్రపోయె
విజయరామరాజు పైనలంఘించితడు
చిటికలో శిరసును త్రెంచినాడు
ఎల్లసైన్యము భీతిల్లి వెడలి చనగ
తనకు తనే ఆత్మతర్పణ జరుపుకొనెను
ఉత్తరాంధ్రకు పేరు తెచ్చిన గొప్పవాడు
ఎత్తరాజెండ మనదేను ఉత్తరాంధ్ర

- ప్రజాకవి - వంగపండు

) బాపడై పుట్టియు బడుగులకే బ్రతుకని
స్వాతంత్రోద్యమున సాగినాడు
నాటి గంజాం జిల్లా మేటి వీరుడనగ
రాజకీయాలలో రాటుదేరె
జాతీయ కాంగ్రెస్ నేతగ నిలచాడు
పదవుల నెన్నిటినో పట్టినాడు
చికాకోలు ప్రాంతాన ఎక్కడికి వెళ్ళిన
బడుగుల బాగుకై పాటుపడెను
బడుగు బలహీన వర్గాలు బాగుపడగ
రేయి పవలు కృషిచేసిన నేత ఇతడు
ఇతడె, పుల్లెల, శ్యామసుందరం, ఖ్యాతిపరుడు
ఎత్తరాజెండ మనదేను ఉత్తరాంధ్ర

) వి. వి. గిరి. నాయకుడు విప్లవోద్యమమూర్తి
కార్మికుల నెల్లరికి కాంతిరేఖ
ఢిల్లీ సభకునాడు ఎన్నుకోబడినాడు
ఉత్తరాంధ్రకే ప్రజాప్రతినిధితడు
రాయఘడ్ - గుణపూర్ - జైపూర్ - కోరాపుట్
నాటి గంజాం జిల్లా మన విశాఖ
ప్లీడరు వృత్తిని విడనాడి వి. వి. గిరి
దేశ సేవ జేయు దీక్షబలిపె
రాష్ట్రపతిగ గద్దెనెక్కిన ఘనుడితండు
ఇందిరమ్మ గౌరవమును అందినోడు
ఉత్తరాంధ్రకే పేరు తెచ్చిన గొప్పవాడు
ఎత్తరాజెండ మనదేను ఉత్తరాంధ్ర

7) బడుగులకు దళితులకు భాగ్యదాత ఇతడు
వెనుకబడ వర్గాల వెలుగు ఇతడు
రాజులు రైతులను రాచిరంపానెట్ట
రైతోద్యమాలను నడిపినాడు
రైతురంగ మెచ్చు ఘన శిష్యుడయ్యెను
పదవులను తృణప్రాయమనెను
బీదలను పేదలను ఆదుకొనగనితడు
ఎల్ల ధనికుల నెదిరించినాడు
ఉత్తరాంధ్ర రైతాంగ విముక్తిదాత
గౌతులచ్చన్న సర్దార్ బిరుదాంకితుండు
ఉత్తరాంధ్రకు పేరుతెచ్చిన గొప్పవాడు
ఎత్తరాజెండ మనదేను ఉత్తరాంధ్ర

8) జీ.బి. అప్పారావు జైకొట్టి నిలచాడు
రైతు జన బాంధవుడు రైతురాజు
రాజుల నెదిరించి రైతులను గాచాడు
భూమి పట్టాహక్కు పొందగాను
ఉమ్మడి వైజాగ్ బోర్డు చైర్మెనయి
అభివృద్ధి పనులెన్నో అమలుపరచె
దున్నుకొను రైతులకున్నతిని తెచ్చాడు
ఉత్తేజపరచాడు ఉద్యమించి
రాజ సంస్థానములనెల్ల రద్దు పరచె
రైతు రంగ లచ్చన్నల జి.బీల కృషియె
ఉత్తరాంధ్రకే పేరు తెచ్చిన గొప్పవాడు
ఎత్తరాజెండ మనదేను ఉత్తరాంధ్ర

– ప్రజాకవి – వంగపండు

9) చిక్కోలు - బొబ్బిలి - చిగురు కొమ్మకు సేవ
జూడగ నెల్లరు శూరులేను
ఎక్కుపెట్టిన బల్లెముక్కు పిడుగులేను
వెన్నుజూపనట్టి వీరవరులు
బానిస బ్రతుకులను బ్రద్దలు చేయగ
భాధించు గెద్దల తరుమువారు
పేదలను తిన్నోడు ఎంత పెద్దయినను
నడివీధి నిలబెట్టి అడుగువారు
మందసాదరివీర గున్నమ్మ అనెడి మహిళ
రాజునెదిరించి వీరస్వర్గమలంకరించె
ఉత్తరాంధ్రకు పేరు తెచ్చిన గొప్పవనిత
ఎత్తరాజెండ మనదేను ఉత్తరాంధ్ర

10) అట్టడుగు జాతుల అభివృద్ధి కిరణము
ప్రజ్ఞాధురీణుడు ప్రతిభపరుడు
చిక్కోలు పరిషత్ వైస్ ఛైర్మెన్ అయి
జనహిత కార్యాల్ని జరిపినాడు
శాసన సభ్యుడై తదుపరి తీర్పరై
ఆంధ్రులకు ఆదర్శవంతుడయ్యె
రాష్ట్ర హైకోర్టులో వాసిగాంచెనితడు
నిలువెత్తు న్యాయమున నిలచినాడు
దళిత ప్రజల భవితకు మార్గదర్శి
సచ్ఛీలుడు కె. పున్నయ్య న్యాయమూర్తి
ఉత్తరాంధ్రకు పేరుతెచ్చిన గొప్పవాడు
ఎత్తరాజెండ మనదేను ఉత్తరాంధ్ర

- ప్రజాకవి - వంగపండు

11) ఆదిమ తెగలలో నవతరించినవాడు
సకల జనహితుడు స్వధర్మపరుడు
కొత్తూరు - నాగూరు - సాలూరు - ప్రాంతాలు
పార్లమెంట్‌లో ప్రజాప్రతినిధితడు
చిక్కోలు జిల్లాలో చిక్కులెన్నో ఉన్న
జాతిని రక్షించునేత అయ్యే
అభివృద్ధి శూన్యలు ఆదివాసులనెల్ల
ప్రగతి పథమువైపు నడిపినాడు
శాసన సభ్యుడై సాధించె పనులెన్నో
వండవ దొరని ఇతనిని ప్రజలు పిలుచు
ఉత్తరాంధ్ర దళితులలో గొప్పవాడు
ఎత్తరాజెండ మనదేను ఉత్తరాంధ్ర

12) తెన్నేటినెరుగని తెలుగువాడుండడు
తెన్నేటి విశాఖకు వన్నెతెచ్చె
రాజనీతిజ్ఞుడు రాజకీయాలలో
పేరుగాంచినట్టి పెద్దమనిషి
వైజాగ్ జిల్లా పరిషత్ చైర్మనయి
ఘనవిశాఖ నగర జనవిధాత
ఆంధ్రకేసరికి అత్యంత ప్రియతముడు
ప్రజల పార్టీకి ప్రాణదాత
ఆంధ్ర రాష్ట్రార్థిక మంత్రిగ ఖ్యాతినందె
ఆంధ్రుల హక్కు విశాఖ ఉక్కు ఉద్యమించె
ఉత్తరాంధ్రకు పేరు తెచ్చిన గొప్పవాడు
ఎత్తరాజెండ మనదేను ఉత్తరాంధ్ర

- ప్రజాకవి - వంగపండు

13) పీ.వి.జి.రాజుగ పేరెన్నికనుగనె
దానకర్ణుడనగ ధరణిలోన
కోటలను పేటలను పాఠశాలలకిచ్చి
విద్యలను పోషించే వివేకశాలి
రైతులిచ్చినదే రాబడి పన్నని
వచ్చినదే ఖజాన అన్నవాడు
శిస్తుదస్తుల కొరకు రైతులను దండించ
నొల్లని రైతు శ్రేయోభిలాషి
పాలకుడు - ప్రజలెల్ల - రాజులని పలికినాడు
రాచబిడ్డ సామ్యవాది ప్రజాసామ్యవాది
ఉత్తరాంధ్రకే పేరుతెచ్చిన గొప్పవాడు
ఎత్తరాజెండ మనదేను ఉత్తరాంధ్ర

14) తంగేటి రాజులు సాగి వంశమువారు
విశాఖ జిల్లాలో విఖ్యాతిపరులు
కోట ఊరట్లలో కొలువు తీరినవారు
ప్రజల మనిషిగ ప్రఖ్యాతినందె
శాసనసభ్యుడు రాష్ట్రమంత్రి వరుడు
సూర్యనారాయణ పృథ్విభుడు
రోసాలు వెలిబుచ్చి మీసాలు మెలితిప్పి
బీదపేదల నెల్లనుద్ధరించె
జిల్లా పరిషత్ చైర్మన్‌గ నిలిచినాడు
బాగుపడె రహదార్లు భవనాలు బడులవెన్నో
ఉత్తరాంధ్రకి పేరెతెచ్చిన గొప్పవాడు
ఎత్తరాజెండ మనదేను ఉత్తరాంధ్ర

15) సోషలిజమనుమాట సోకింది ప్రతిచోట
ఉత్తరాంధ్రలో భాట్టముద్యమించ
ఉద్యమానికి గొప్ప ఊపిరినివ్వగ
బీహార్ తరలిన దేశభక్తి
వైజాగ్ పరిషత్ ఛైర్మెన్ యితడుర
అభివృద్ధి పనులెన్నో అమలుచేసే
తెలుగు మహాసభల జలగము జరిపించ
రాష్ట్రమంత్రిగ గొప్పపాత్ర పోషించె
మంచివక్త మాటకారి ప్రజాచైతన్య దాత
ఘన విశాఖ రాజకీయాల్లో ఘనుడితండు
ఉత్తరాంధ్రకు పేరుతెచ్చిన గొప్పవాడు
ఎత్తరాజెండ మనదేను ఉత్తరాంధ్ర

16) ద్రోణము ఒకనాటి జాత్తాడ కరణం
రాజకీయాల రారాజు అయ్యే
జాతి బలము లేని ఆత్మ బలశాలిర
ప్రాణవాయువు తనకు ప్రజల హితమె
జాతీయ కాంగ్రెస్‌నేతగ ఖ్యాతిగొనె
ఉత్తరాంధ్రకితడే ఊపిరికద
ముఖ్యమంత్రులకు ముఖ్య అనుచరుడితడు
సఖ్యతతో జనసేవ సలిపినాడు
రాజ్యసభ సభ్యునిగ ప్రజా, రధమునడిపె
మంత్రి పదవి తప్పు చేయని పదవిలేదు
ఉత్తరాంధ్రకే పేరు తెచ్చిన గొప్పవాడు
ఎత్తరాజెండ మనదేను ఉత్తరాంధ్ర

- ప్రజాకవి - వంగపండు

17) ఏబదేండ్ల - వెనుక ఎర్ర జెండగరేసి
ఎల్ల కార్మికులకు - వెలుగుజూపె
దోచుకొను బడువారు - దోపిడిపరులని
వర్గ సంఘర్షణ - తప్పదనెను
రాజులనెదిరించి - రైతుపోరాటాలు
అనకపల్లి ప్రాంతమదరెనుకద
శాసన సభ్యుడై సాధించె పనులెన్నో
కార్మిక సంఘాల కదనశక్తి
మనకళింగాంధ్ర - కె.గోవిందరావు
కమ్యునిజమె కష్టజీవికి కలిమిఅనెను
ఉత్తరాంధ్రకు పేరుతెచ్చిన గొప్పవాడు
ఎత్తరాజెండ మనదేను - ఉత్తరాంధ్ర

18) జాతీయతాదేశభక్తి - తాత్త్వికవాది
మనదేశ సంస్కృతీ - మణిపూసఇతడు
శాసనమండలిలో వాదించే ఘనశక్తి
పీ.వి.చలపతిరావు - పేరువడిసె
అట్టడుగు వాడైన - నిట్టనిలువుగ లేచి
రాజకీయాలలో రాటుదేరె
ఉన్నతులు - తనకెన్ని ఇడుములు పెట్టిన
పార్టీ శ్రేయస్సునే పదిలపరచె
ఘనవిశాఖ అనకపల్లి - ఉత్తరాంధ్రలోన
భా.జ.పా.శక్తికితడెంతో - బలమునిచ్చు
ఉత్తరాంధ్రకు పేరు తెచ్చిన గొప్పవాడు
ఎత్తరాజెండ - మనదేను - ఉత్తరాంధ్ర



- ప్రజాకవి - వంగపండు

## ఉత్తరాంధ్రలో - గొప్పవాళ్ళు

1. ఆనందగజపతి - ఆంధ్రభోజుడు
2. బొబ్బిలి రంగారావు బహద్దూర్ - బడుగు వర్గాల నాయకుడు
3. అల్లూరి సీతారామరాజు - తెల్లదొరల హృదిబల్లెం
4. తాండ్రపాపారాయుడు - బొబ్బిలి - బెబ్బులి
5. పుల్లెల శ్యామసుందరం - పూజ్యనీయుడు
6. వి. వి. గిరి - కార్మికోద్యమనేత
7. సర్దార్ గౌతులచ్చన్న - రైతోద్యమనాయకుడు
8. తెన్నేటి విశ్వనాథం - విశాఖ కీర్తికిరీటం
9. పి.వి.జి.రాజు - సోషలిష్టునాయకుడు
10. జి.బి. అప్పారావు - రైతురాజు
11. ద్రోణంరాజు సత్యనారాయణ - కాంగ్రెస్ పార్టీ నాయకుడు
12. కె. పున్నయ్య - మేధావి ప్రతిభావంతుడు
13. సాగి సూర్యనారాయణరాజు - ప్రజాసేవకుడు
14. భాట్టం శ్రీరామమూర్తి - ప్రజాస్వామ్య సామ్యవాది
15. వీరగున్నమ్మ - మందసా వీర నారీమణి
16. వండవ దొర - దళిత జన భాంధవుడు
17. కె. గోవిందరావు - కమ్యూనిష్టు నాయకుడు
18. పి. వి. చలపతిరావు - భా.జ.పా. నాయకుడు

- ప్రజాకవి - వంగపండు

# ఉత్తరాంధ్ర

(చరిత్ర-సంస్కృతి)

3వ భాగము

## 2వ ప్రకరణం - కవులు - రచయితలు

1) కృషి ధర్మమే పుడమి శ్రీకృష్ణ ధర్మమనె
కర్షక మహర్షి కవిరాజె వినర
ప్రజల భాషలోన కవితలు జెప్పగ
గుప్తనిధులనిచ్చె గురజాడెకదర
గ్రాంధిక భాషలో ఘనత లేదనిచాటె
గిడుగు రామ్మూర్తి ఘన పండితుడుర
తెలియని రాతలవి ఎల్లరికి రోతలనె
తాపీ ధర్మారావు తాత్త్వికుడుర
మన కళింగాంధ్ర వన్నె తెచ్చినకవులువీరె,
నవ్య కవితాంధ్ర భాషా చతుష్టయమిది
మనకవులువీరి - రచనలనరయవలయు
కవిరచయితలకుత్తరాంధ్రఖ్యాతినందె

2) వేద పండితులకు నెలవైనదీ భూమి
సాంఖ్యాయనాచంట సంస్కృతకవి
సంగీత సాహితీ శారదారూపము
ఆదిభట్ల ఘనుడు హరిదాసుకదర
ఆధ్యాత్మిక జ్ఞాన ఆర్ష ధర్మపరుండు
కావ్యకంఠఋషి గణపతిముని
ఉభయ భాషలలోన నుద్దండ పండితుడు
విద్వత్కవిగ వి. లక్ష్మినాయుడు
ఘనకవీంద్రులు - అచ్యుతరామరాజు
యస్వీ.జోగారావు - కళింగాంధ్ర ప్రబంధకర్త
మన కవులు వీరి రచనల, నరయవలయు
కవి - రచయితలకుత్తరాంధ్ర కంచుకోట

- ప్రజాకవి - వంగపండు

3) గేయ కవితారాజు శ్రీశ్రీ మనవాడె
మహిమహా ప్రస్తాన కావ్యకర్త
ఆరుద్ర రచనత్వమే వాహమ్‌ది
ఉత్తరాంధ్ర బిడ్డగొప్పతనమే
విప్లవ కవితలను విస్తరింపజేసే
ఘనుడు నారాయణబాబు మనవాడే
రాజసంస్ధానాల్లో రాణించు కవితను
సామాన్యులకు నందజేసినారు
శ్రీశ్రీ - ఆరుద్ర - నారాయణ త్రినేత్రులుకద
ఆధునికాంధ్ర కవిత్రయ మనగవీరె
ఆధునిక కవితకు - వీరె ఆద్యులు కద
కవి రచయితలకుత్తరాంధ్ర కంచుకోట

4) రావిశాస్త్రి రచన రత్తాలు రాంబాబు
గుడిసె వాసులయొక్క గుండెచప్పట్లు
చాసోకధలవి మానసిక చిత్రణలు
అట్టడుగు ప్రజలార్తి అవగతాలు
కారామాష్టారు కధలు తీరేవేరు
స్పందించు జీవన యజ్ఞమెకద
కధను త్రొక్కిన మన వచన రచయితలుర
ఆధునిక భావరీతికి ఆద్యులుకద
పేదబీద అనాధ జీవుల మేలుకొల్ప
కధలు వ్రాసిరి కళింగాంధ్ర కాంతిగొనగ

5) రోణంకి బహుభాష పండితుండనగను
"దిప్రిన్స్" తెరచిన తెలియగలదు
పురిపుండ ఘనుడైన రచయితయనగను
"పులిపంజ" విప్పిన బోధపడును
వంగపండభ్యుదయ ప్రజలకవియనగను
"పాంచజన్యం" చదువ ప్రకటితమగు
కవిరాజ పాత్రుడు - పండితుడు పాల్వెవెల్లి
ఘనసాహితీ విశారదులు కదర
యతిగణప్రాస నియమాలు గతులెకదర
గతిని బాసిన సృష్టిలో గల్లంతెకదర
గాలిపటములా ఎగిరిగంతేయ కవిత
రెపరెపలెమిగులెంతో కాలం నిల్వలేదు

6) తెల్ల దొరల నెల్ల వెల్లగొట్టగనాడు
గర్జించె గరిమెల్లపాటలేను
అరుణ పతాకమే ఆర్తులకు వరమును
ఘనుడు పాణిగ్రాహి గాయకుండు
చిక్కోలు కథసెప్ప శివమెత్తె ప్రజలాడు
విప్లవ రచయిత వి. ప్రసాద్
ఉత్తరాంధ్రలోన ఉన్నారు రచయితలు
మూలమూలలందు ముఖ్యులనగ
సాంప్రదాయాధునిక కవితా కేంద్రమిదిర
ఉత్తరాంధ్ర భిన్నదారుల కున్నతినిడె
బాస కూపిరెడె నడిదము వారేకదర
కీర్తిరథ మెక్క ఖ్యాతి శ్రీ శ్రీదెకదర

7 ) పదునెన్మిది శతాబ్దివచ్చు వరకిచ్చట
కవితల జాడలే కనిపించలేదు
అగ్రకులస్థులు సద్బ్రాహ్మణులునాడు
కవితలు జెప్పెడినాధులుకద
అడిదము సూరకవి ఆదికవి ఇచ్చోట
ఆంధ్రనామ నిఘంటువతనిదెకద
బాల భాస్కర కూర్మనాధ పాపయ్యలు
బంకుపల్లి వజ్జల మండపాక
అప్పకవి భూసురుడె కవితకు కర్త అనిన
కృష్ణ విజయ సంకల్పాల గ్రంధ కర్త లెవరు !
రాయడప్పమన వెలమల ప్రభువెకదర
పూసపాటి తిమ్మరాజు మన పూర్వకవిర

8 ) భిన్న కవిత్వాలు భిన్న సిద్ధాంతాలు
వన్నెకెక్కిందిర మన కళింగ
యుద్ధమిచటబుట్టె శాంతి ఇచటగలిగె
సకల జన కళ్యాణి మన కళింగ
పలుకుబడులభాష బడి పలుకుల భాష
కవితల విన్యాస మన కళింగ
ఉత్తర కళింగాంధ్ర మహాశ్శక్తిగలది
ఆది నుండి యత్యద్భుత చరిత్ర కలది
కవి, రచయితలకుత్తరాంధ్ర కంచుకోట
ఎత్తరాజెండ మనదేను ఉత్తరాంధ్ర



– ప్రజాకవి – వంగపండు

## ఉత్తరాంధ్ర పూర్వ కవుల రచనలు

1. అడిదం సూరకవి - ఆంధ్రనామ సంగ్రహం (1730)
2. బాల భాస్కరకవి - శుద్ధాంధ్రరామాయణం (1690)
3. కూర్మనాధ కవి - నారసింహాద్రిశతకం (1730)
4. పాపయ్యకవి - మహిషాసురమర్దనిశతకం
5. వర్ఝల చినశీతారామస్వామి - వ్యాకరణ సంహిత సరస్వతి
6. మండపాక పార్వతీశ్వరశాస్త్రి - కవితాల తాంకురం (1833)
7. పూసపాటి తిమ్మరాజు - కృష్ణవిజయ ప్రబంధం
8. బొబ్బిలి శ్రీరాయడప్ప - సంకల్ప సూర్యోదయం

## నవ్యాంధ్రకవిశేఖరులు

1. ద్వారపురెడ్డి అప్పలనాయుడు - శ్రీకృష్ణ ధర్మవిజయం (ప్రబంధం)
2. గురజాడ అప్పారావు - కన్యాశుల్కం (నాటకం)
3. గిడుగు రామ్మూర్తి - బాలకవి శరణ్యం (పద్యసాహితి)
4. తాపే ధర్మారావు - విజయ విలాసం (వ్యాఖ్యానం)

## సంస్కృతాంధ్ర భాషా పండితులు

1. ఆచంట సాంఖ్యాయన శర్మ - సంస్కృతాంధ్రభాషాపండితులు
2. ఆదిభట్ల నారాయణదాసు - శతాధిక గ్రంధకర్త- హరిదాస్
3. గణపతి ముని - కావ్యకంఠ ఋషి
4. వి. లక్ష్మీనాయుడు - బహుగ్రంధకర్త - విద్వత్కవి
5. అచ్యుత రామరాజు - గ్రంధ రచయిత
6. యస్వీ. జోగారావు - ప్రబంధ రచయిత

## కళింగాంధ్ర కవిత్రయం

1. శ్రీశ్రీ - మహాప్రస్థానం
2. ఆరుద్ర - త్వమేవాహం
3. నారాయణబాబు - రుధిరజ్యోతి

## కథారచయితలు

1. రావిశాస్త్రి - రత్నాలరాంబాబు
2. చా.సో - అల్పజీవి
3. కా.రా. - యజ్ఞం

## అభ్యుదయ కవి పండితులు

1. రోణంకి - దిప్రిన్స్
2. పురిపండ - పులిపంజ
3. వంగపండు - పాంచజన్యం

## ఉద్యమ విప్లవ గేయకవులు

1. గరిమెళ్ళ - జాతీయ గేయరచయిత
2. పాణిగ్రిహి - గాయక రచయిత
3. వి. ప్రసాదరావు - గాయక విప్లవకవి

- ప్రజాకవి - వంగపండు



ప్రజాకవి - వంగపండు - డా॥ ఎమ్. గోపాలకృష్ణారెడ్డి,
Ex. Vice Chancellor, A.U.

# ఉత్తరాంధ్ర

## (చరిత్ర-సంస్కృతి)

### చతుర్థ భాగము

### 1 వ ప్రకరణం - బడుగుజనులు (శూద్రకులజులు)

1) బహుళ సంఖ్యాకులము బడుగులముమేమెల్ల
వెచ్చించి తీరాలి - వెయ్యికోట్లు
జీవనాధారము వ్యవసాయమే మాకు
నదులకానకట్లు - కట్టితీరాలి
ఋణగ్రస్తులైనాము - రైతుకూలీలము
ఋణవిమోచన చట్టమొకటితేవాలి
భూరియా కమీషను కోరియున్నందున
గిరిజన పాడేరు - జిల్ల - కావలయు
ఉత్తరాంధ్రకుపముఖ్య మంత్రి పదవి
పాలనాభివృద్ధి మండలి కావాలి మాకు
బడుగులదే రాజ్యాధికారం - బలముమనదె
ఎత్తరాజెండ - బడుగులదె - ఉత్తరాంధ్ర

- ప్రజాకవి - వంగపండు

1) వెట్టిచాకిరి చేస్తు పొట్టకూటి కొరకు
ప్రొద్దెల్లపని పురోహితులనిండ్ల
పాలకుల మెచ్చగ పనిపాటులోనరిస్తు
పడిగాపుకాసిరి రాజులిండ్ల
బక్కలా పనిచేసి వస్తువులు తెగమోసి
బ్రతుకులనీడ్చిరి వైశ్యులిండ్ల
పరిచర్యలోనరిస్తూ పాదపూజలు చేయు
బడుగులే శూద్రులు అడుగునపడె
గత చరిత్ర కట్టుబాట్ల నలిగి అరిగి
తరిగి కరిగిన బడుగుల బ్రతుకులివియె
బాని సత్వ బంధనాల విబాసిచనగ
ఎత్తరాజెండ - బడుగులదె - ఉత్తరాంధ్ర

2) బడుగులనార్యులు వర్ణ సంకరులు
వర్ణ వ్యవస్థలో వర్థిల్లినారు
అష్టాదశ పురాణాల్లో చేరదు భారతం
వర్ణ సంకరజాతి వంశవర్థినిర
"వేదము" త్రయీధర్మమెత్తి జూపగనాడు
చతుర్వర్ణ ధర్మమును చాటె "భారతము"
సాత్విక - రాజసిక - తామసిక - త్రయమిది
గుణకర్మ ప్రవృత్తికి - గురుతులివియె
కృష్ణుడే - పరిచర్యాత్మకం "కర్మ" అనగ
జాయతే వర్ణ సంకరమనొక జాతి వెలిసె
శూద్రులన - వీరే బడుగులు - చూడగాను
బహుజనులవీరు ? - ఎన్నటికి కానేకారు

- ప్రజాకవి - వంగపండు

3) యాదవులు వెలమలు - గవర - కాళింగులు
కాపు-తెలగ-బలిజ-బడుగువారె
గనిలోన వనిలోన కార్ఖానాలలో
అధిక సంఖ్యాకులు బడుగువాళ్లె
కట్టుపనివాళ్ళు - కమ్మరి వడ్రంగి
గృహవృత్తిదారులు - బడుగువారె
బట్టనేసినవాడు - బట్టలుతికినవాడు
జంగము - కుమ్మరి - బడుగువాడె
బడుగులన - శూద్రులె పరిచర్యాత్మకులుర
సకలసేవలుత్పత్తులకు సాధనాలు
జాయతేవర్ణ సంకరంబనగ - దారికలిగె
ఎల్లరము శూద్ర వర్గంనకు చెందగలము

4) బస్సులు తిరగవు రైళ్లు పరుగెత్తవు
బడుగువాడు అడుగు బంద్‌జేయ
పంటలు పండవు భాగ్యాలు నిండవు
బడుగులు పాటుపడ అలిగినపుడు
పండుగులు జరుగవు జాతరులుండవు
బడుగులు భాగము కానివాడు
కోటలో వెలయవు పేటలు ఉండవు
బడుగు జనులు పంతమూనునాడు
బడుగులే ఉత్తరాంధ్రకు బలిమికలిమి
అడుగువేయర ముందుకు తడబడకను
బహుళ సంఖ్యా బలీయుడ బడుగువాడ
బడుగులదె రాజ్యాధికారము బలముమనదె

- ప్రజాకవి - వంగపండు

5) ఘనుడు అంబేద్కర్ - జనవిభాగమొనర్చి
మనదేశ రాజ్యాంగ రచనకర్త
దళితులు శిష్టులు బడుగులనుపేర
మూడు విభాగాలునేడు నిలచు
సాంప్రదాయాచార పద ఘట్టనలపడు
తెగలు - "దళితులని" - తెలిసికొనుము
తరతరాలగ సంఘ - గౌరవం - విద్యలను
అందిన "శిష్టులు" గనుండునేడు
తెగలు - జాతులు "దళితులని" - పిలవబడగ
అగ్రవర్ణాలు - "శిష్టులుగ" అరయబడిరి
శేష, జాతులు "బడుగు" బి.సీలె కదర
బడుగులెల్లరిదొక సంస్కృతి భావ్యమదియె

6) తరతరాలుగ మనం బడుగులమ్మైతిమి
అధికార పదవులు అబ్బవనిరి
ఎన్ని సంపదలున్న ఎంతగా డబ్బున్న
శూద్రులు చులకనగ చూడబడిరి
పెట్టిపుట్టినపుడె పెద్దరికాలనె
బడుగులల్పులనుచు బలికిరికద
గొప్పసేవల జేసి మెప్పులనందిన -
కాళ్లకు మ్రొక్కుతునె బ్రతికితిమిర
బడుగులే లేక సంఘము బాగుపడదు
సంఘశక్తికి మనమెల్ల సారధులము
పరులపాల బడినకడు బాధితులము
వెనుకబడితి మేక వర్ణ సంజనితులుముర

- ప్రజాకవి - వంగపండు

7) నాడు బహిష్కృతులు - గౌరవానర్హులు
వీరెదళితులు - విశిష్టులుకద
ఆనాడు అట్టడుగు - ఈనాడు - అందలం
వీరెదళితులు - విశిష్టులుకద
ఆనాటి అల్పులు - ఈనాటి ఘనులుర
వీరెదళితులు - విశిష్టులుకద
నాడుపేరులేదు - నేడూరువారిదే
వీరె దళితులు - విశిష్టులుకద
వీరుగాక - వేరొకరున్నారూరనేడు
వారె బడుగులు - శూద్రులు - తీరుమారు
అధిక సంఖ్యాబలీయుడా! అదునిదేర
ఎత్తరాజెండ - మనదేను - ఉత్తరాంధ్ర

8) బడుగులన్మరల - మన బ్రతుకుదార్లనుజూపి
విభజించి విడగొట్టి నెట్టినారు
వెనకబడువారిలో - ముందడుగువేయగ
అగ్రకుల - శూద్రులని - కత్తిరిడిరి
కమ్మ-రెడ్డి - కాపు - అధికులని చాటుచు
వెనుకబడినవారు - వీరుకారు
దళితులకు - కేంద్రమే - రక్షించుననిబలికి
బడుగులకు - రాష్ట్రమే - రక్షణనిరి
కమ్మ-రెడ్డి శూద్రులలోనగ్ర జాతులనిరి
అగ్రవర్ణము - అగ్రకులము - అధికులైరి
శూద్రులననేడు - చులకన -కాదుకదర
నేడుకద - సంఖ్యాబలం వలన - నెక్కెగద్దె

- ప్రజాకవి - వంగపండు

9) మాల మహానాడు - మాదిగ దండోర
నేటి సంఘానికే మేలు కొలుపు
తమపేర్ల - చివరను - జాతినామాలను
తగిలించి - తమ జన్మసార్థకమనె
ఆత్మన్యూనతభావ - మతిదోషమనిచాట
స్వీయ జన్మలె - ఎంతో శ్రేష్టమనెను
దళిత సంస్కృతిమాది - దళితులంమేమని
స్వాభిమానము కలిగి సంచరించె
మాల - మాదిగ - రెల్లి - పైడ - ఆది ఆంధ్ర
అభిమానధనులు స్వతంత్రులుకద
వీరె దళితులు -బడుగులమైతిమిమనం
బడుగు సంస్కృతి మనది జనశృతి ఇది
దళితులది - బడుగులది - దారి ఒకటె
ఎత్తరా జెండ - మనదేను - ఉత్తరాంధ్ర

10) బ్రాహ్మణ సంఘాలు బరిలోన నిలచాయి
శూద్ర సంఘాలును చొరవచూపాలి
వైశ్యసంఘాల వెలసె నెల్లెడలను
బడుగుజన సంఘాల భవిత మనది
క్షత్రియ సంఘాలు - సర్వత్రనున్నవి
పరిచర్యజాతులం - సంఘముండాలి
అధిక సంఖ్యాకులు - శూద్రులే ఈనాడు
బి.సీ - సంఘాలని - దేవులాట
దళితులవలె - బడుగులెల్ల - ముందుడుగువేసి
స్వీయ సంస్కృతిని - చేరదీయవలయు
దళిత సంస్కృతి - శూద్ర సంస్కృతి - బలముగలవి
ఒకటి - ఉన్నచో - వేరొకటి యునికి గలుగు



- ప్రజాకవి - వంగపండు

# ఉత్తరాంధ్ర

(చరిత్ర-సంస్కృతి)

**చతుర్థ భాగము**

**౭వ ప్రకరణం - బి.సి. వెలుగు కిరణాలు**

1) ఘనుడు - బొడ్డేపల్లి - జననేత - తులసిదాస్
గొర్లె శ్రీరాములు - డోలశీతారాం
జననేతలుకలాపు ఘననేత గుండు -
అట్టడుగు వారికి - ఆత్మబంధువులు
బాబు పరాంకుశం - తంగి - తమ్మినేని
త్రిపురాన శ్యామల - పీరు కట్ల
కళాసోదరులు - గౌతు - హరిబాబులు
కణితి - విశ్వనాధ - మప్పయ్యదొర
చీకటిలో చిందులాడిన - శ్రీకాకుళమున
వెనుక బడిన వారికి - వీరె వెలుగునిడిరి
ఇంకనెందరోగలరు వివరణ్ణివ్వలేను
ఎత్తరాజెండ - బడుగులదె - ఉత్తరాంధ్ర

2) యస్సార్యేయస్స్ - మరుడు - గుడివాడ
ఆర్. సత్యనారాయణాల్వారుదాసు
అప్పల నరసింహమయ్యన్న - పాత్రుడు
విశాఖ మండలి - కీర్తి ప్రభలు
వారాడ - మన రమణ - సబ్బంహరియును
కురచ - పాలవెల్లి - గూనూరు - పైల
పప్పల చలపతి - గొప్పమనసాతనిది
బండారు - తిప్పల - భరణికాన
దాడివీరభద్ర - కొణతాల - రామకృష్ణ
మన పీ.వి.చలపతి - బలిరెడ్డి -సత్యారావు
ఘన విశాఖలో - నెందరో ఘనులు కలరు
ఎత్తరాజెండ - బడుగులదె - ఉత్తరాంధ్ర

- ప్రజాకవి - వంగపండు

3) ఘనుడు రామస్వామి జనహితుడు - పండితుడు
వెనుకబడువారికి వన్నెతెచ్చె
విజయనగరజిల్లా పెదపెంకిలో పుట్టి
పౌరాణికునిగ ప్రసిద్ధివడసె
రాజకీయాలలో - రాటుతేలిన వ్యక్తి
సంజీవరెడ్డి కతిసన్నిహితుడు
అక్షరం పోత్తెరుగని - ఉత్తరాంధ్రలోన
చదువరులు శూద్రులని చాటినాడు
వెలమకులాభివృద్ధి సంఘమునకు వెలుగునిచ్చె
పార్వతీపురం బొబ్బిలిలో సభలు జరిపినాడు
కాంగ్రేసుకు పెద్ద దిక్కుగ నడిచినాడు
వెలమలకు పెద్దింటి రామస్వామి వెలుగెకదర

4) ఉత్తరాంధ్ర రైతుకూపిరినిచ్చాడు
రైతుబిడ్డమన వి.కృష్ణమూర్తి
వాసిరెడ్డి కొడుకె - వరద రామారావు
వినయవిధేయతల వెలుగుజూడ
పి.జగన్మోహన్‌రావు వెలమలనాయకుడు
శాసనసభ్యుడు - జనహితుండు
బొబ్బిలి పార్వతీపుర ప్రాంతాలలో
బడుగులదె అధికారమాదినుండి
వెలమలె ఈ ప్రాంతానికివెలుగుకదర
వీర బొబ్బిలి ఒకనాటి వీరులదన
నేటి బొబ్బిలి - అలనాటి వెలమలదెరా !
బేబినాయన - బొబ్బిలి చినరాజుకదర !

- ప్రజాకవి - వంగపండు

5 ) నేత వాసిరెడ్డి - మేధావి పరుశురాం
మంచికి - మరిశర్ల - అప్పుడుదొర
పారన్న - తెంటు - సంబంగి కోట
బోత్స - సత్తిబాబు - చౌక్కాపు - కోళ్ళ
బేబినాయన కోట్ల వీర భద్రస్వామి
నారాయణప్పల సన్యాసినాయ్డు
రాంబాబు - సింహాద్రి - మంత్రి పతివాడలు
కోట ద్వార్పరెడ్డి - కూర్మినాయుడ
శివప్రసాద్ - శశిభూషణ్ - శివున్నాయుడు
బడుగులలో నేతలనబడు ఘనులువీరె
విజయ నగర జిల్లాలొనింకెంత మందో
ఎత్తరాజెండ - బడుగులదె - ఉత్తరాంధ్ర

6 ) శాసన సభ్యుడు రాష్ట్ర మంత్రివరుడు
అయ్యన్నపాత్రుడఖిలజన హితుడు
పదవులు - తనదరికి వచ్చి పడినవితప్ప
తనుపదివికేనాడు తపన పడలేదు
నైష్కర్మసిద్ధిగల నిక్కచ్చిమనిషిర
నిత్య జనసేవలో నిలచువాడు
ఘన విశాఖ నరశిపట్టణ ప్రాంతాలు
తనసేవ ప్రగతికే అద్భుతవరాలు
చింతకాయలయ్యన్న పాత్రుడనిన
ఉత్తరాంధ్ర రాజకీయాలలో కొత్తమలుపు
బడుగులను కాపాడు భీమబలమతనిది
ఎత్తరాజెండ బడుగులదె ఉత్తరాంధ్ర

- ప్రజాకవి - వంగపండు

7) కె. కోటపాడది వెలమల కోటది
నాయకుడు - వారాడ - నారాయణుండు
వెనుకబడిన ప్రజకు వెలుగుదీపమితడు
సాహసి - సత్క్రియుకార్యవాది
మండలాధ్యక్షుడై దండిగ కృషిసలిపి
బడుగులకు రక్షణగ నడచినాడు
కాంగ్రెస్ పార్టీకి కల్పతరువితడుర
సిద్ధాంతమునునమ్మి నిలచినాడు
ఎవడురా మాకెదురీ ప్రాంతాన ఎదిరింతుమనెను
కొండతోనైన ఢీ-కొనగలిన గుండితినిది
బడుగులకు రక్షణగ నిల్చిన ధైర్యపరుడు
ఎత్తరాజెండ బడుగులదె ఉత్తరాంధ్ర

8) సింహమన అప్పల నరసింహమే నాడు
వెనుకడుగు ఎందులో వేయబోడు
ఘన జన చైతన్య పెందుర్తి సమితికి
అధ్యక్షుడైనాడు అతిరథుడుర
అనకపల్లి లోక్‌సభ సభ్యుడైనాడు
అభివృద్ధి పనులెన్నో అమలుపరచె
ఉత్తరాంధ్రభిమాని ఒక్కడే మొనగాడు
ఫార్టీకతీతముగ పలుకు వాడు
యన్. టి. ఆర్. - మెచ్చి తనకీట నాయకత్వమొసగ
తెలుగుదేశము విశాఖలో వెలుగు గాంచ
జనుల నడిపించు ప్రజాభిమాని
ఎత్తరాజెండ బడుగులదె ఉత్తరాంధ్ర

- ప్రజాకవి - వంగపండు

9) పదిమంది బాగుకు పాటుపడిన వాడు
అనకపల్లి లోక్‌సభ పభ్యుడితడు
ఘన విశాఖ పల్లె జనులెల్ల కొనియాడ
రైతులను రక్షించు రైతురాజు
ఈర్ష్యద్వేషాలకు ఏనాడు లొంగడు
ప్రజలాదరించేడి ప్రజల మనిషి
జాతిజన కాంగ్రెస్ నేతగను నిలచాడు
వైజాగ్ జిల్లాలో పేరుగాంచె
జనులు మెచ్చిన మన కొణతాల రామకృష్ణ
నేడు వైజాగ్ పల్లె ప్రాంతాల రైతురాజు
యువకుడుత్సాహ వంతుడు జనప్రతినిధి
ఎత్తరాజెండ బడుగులదె ఉత్తరాంధ్ర

10) జననేతలచ్చన్న - ఘనుడు - జీ.బి.ఆర్
మన కళింగాంధ్ర - బడుగువారే
ఘన కోడిరామమూర్తి - బలప్రదర్శనశాలి
మనకళింగాంధ్ర బడుగువాడె
వి. లక్ష్మీనాయుడు - ద్వారప రెడ్డిరువురు
మన కళింగాంధ్ర - బడుగువారే
రోణంకి - సిమ్మన్న - వంగపండు - కవులు
మన కళింగాంధ్ర - బడుగువారే
శూద్రవర్ణ - క్షత్రియ సంకల్ప ధీరుడనగ
రాజ్యమేలెను మన రంగరాయ ప్రభువు
బడుగులం బహుజనులం కామ మనము
ఎత్తరాజెండ బడుగులదె ఉత్తరాంధ్ర

11) విశాఖజిల్లాలో ఎలమంచిలోనితడు
శాసనసభ్యుడు - ప్రజల హితుడు
తిరుమల - తిరుపతి - దైవసంస్థానము
ఛైర్మెన్‌గనున్నట్టి - ధార్మికుండు
నిప్పులాంటి - మనిషి - పప్పుల చలపతి
గొప్పలకు - పోనట్టి - గొప్పవాడు
పార్టీ విధేయుడు - ప్రజలకతి సన్నిహితుడు
పలుదపాలుగ - ప్రజాప్రతినిధితడు
నీతి-నిజాయితీ - పరిశుద్ధాత్మకలిగి
ప్రజల సేవకంకితమ్మైన - ప్రజ్ఞాన్వితుండు
పి. చలపతిరావుత్తరాంధ్రనేతలనగ
ప్రజల హృదయాల్లో - నిలచిన ప్రజల మనిషి

12) వెలమల సిమ్మన్న - మేధావి - పెద్దన్న
వెనుకబడు వర్గాల వెలుగురవళి
నిత్యపరిశోధకుడు - సత్య వాక్పరుడు
ఉద్యోగ ధర్మానికూపిరితడు
రాజకీయాల్లేని - రాజనీతిజ్ఞుడు
బహుభాషకోవిదుడు - గ్రంధకర్త
ఆంధ్రయూనివర్శిటీ ఆచార్యవర్యుడు
ఆంధ్రభాషకి తేట పరిచినాడు
ఎన్నో గ్రంధాల్ని - వ్రాసె - విజ్ఞాన్వితుండు
విధ్యుక్తధర్మ నిర్వహణ - ఇతనిసొత్తు
మంచిమనసున్న మేధావి మాకు వెలుగు
వెనుకబడిన వర్గాలకు వెలుగుబాట

- ప్రజాకవి - వంగపండు

13) వంజంగి కాంతమ్మ వైజాగ్ పరిషత్
అధ్యక్షురాలయ్యె అట్టడుగువనిత
బొత్స ఝాన్సీరాణి మెచ్చవిజయనగర
జిల్లా పరిషత్ ఛైర్మనయ్యె
రాజానరమణి - మనఘన విశాఖలోన
కార్పొరేషన్‌కు మేయరయ్యె
ప్రతిభ భారతి - అంబటి - మణి - రత్నమాల
మజ్జి శారద - పిన్నింటి - మృణాళినియు
సత్యవతియు - కోటగౌరి - పడాల అరుణ
ఉత్తరాంధ్రలో - మహిళా రత్నములుకద

14) వంశధారనదీ గడ్డపై జన్మించి
రైతేరాజని - చాటురైతుబిడ్డ
సర్పంచి - అధ్యక్ష - మంత్రిపదవులనంది
జనసేవచేసిన - ఘన మనీషి
చిక్కోలు కాంగ్రెస్ - చిక్కును విడదీసె
చక్కబెట్టినకడు ధైర్యశాలి
గ్రామికరైతాంగ - జనహితైభిలాషి
బడుగు బలహీనుల బాంధవుండు
మాటపడని వ్యక్తిత్వమభిమాన ధనుడు
వెనుకబడిన వర్గాలకు - వెలుగు ఇతడు
ప్రజల మనిషి మన ధర్మాన ప్రసాదరావు
ఎత్తరాజెండ - బడుగులదె ఉత్తరాంధ్ర

- ప్రజాకవి - వంగపండు

15) ఎల్లరు రాజులన్వెనకేసుకొనిరాగ
ఎదిరించి పోరాడనిలచెనెవరు
బుగతలెవరురా - భూమి హక్కులవి
ఎల్ల రైతులవని చెప్పెనెవరు
మనషులందరొకటి కాదన్నకాలాన
సామ్యవాదిగ నిలచి సాగెనెవరు
కమ్యూనిజం - భువికి - కాంతినిచ్చునగ
ఉద్యమాల్నడుపు ఉద్దండుడెవరు
ఆతడే ముదిలి బాబూ పరాంకుశం
వామపక్ష భావాలకు వన్నెతెచ్చె
బడుగులెల్లరు - బంగారు బాట నడువ
శాంతియుత పోరాటమును సలుప సారధితడు

16) బొబ్బిలి ప్రాంతాన - నిబ్బరముగ నిలచి
రైతోద్యమాలను - నడిపినాడు
రైతులింట - బుట్టి - రాజులనెదిరించె
పట్టుదల దీక్షల ప్రతినిధితడు
శాసనసభ్యుడై - సాధించె పనులెన్నో
ప్రజల కష్టమును తీర్చినాడు
చెరుకు రైతులకు నిరతం శ్రమించే
ప్రజలే తన ధనమని పలికినాడు
ఎన్నడును డాబు దర్జాలకు పోనివాడు
నిర్మలుడును దారపరుడు నిర్వికారి
ప్రజల అభిమాని - ఘన సత్సంకల్పపరుడు
తెంటు లక్ష్మినాయుడు - మన వెలమ వెలుగు

- ప్రజాకవి - వంగపండు

17) రణధీరుడే పుడమి - రాజని -పేర్కొన
రైతురాజనెచాటు రాజు ఇతడు
నాన్ బ్రాహ్మణోద్యమం నడిపెనుతన తాత
నాడు బి.సీలకు - తానె కింగ్
లోగడ తన తండ్రి లోక్ సభ సభ్యుడు
ప్రజల ప్రతినిధి ప్రజారాజితండు
వీరి వారసుడు "బే.బి. నాయన" నేడు
చినరాజు - మాకెల్ల - సిరులనిచ్చు
బడుగులనుగావగ - ప్రజారథమునెక్కి
రాజకీయరణమొనర్చగ - తరలివచ్చె
ఉత్తరాంధ్రకు పేరు తెచ్చె మీ పెత్సనమొకద
ఎత్తరాజెండ - మనదేను - ఉత్తరాంధ్ర

18) చిక్కోలు జిల్లాలో - ఎక్కడ జూచిన
కింజరాపెర్రన్న - కీర్తికేతనమె
రైతుబిడ్డలదే - రాజ్యాధికారమన
ఢిల్లీ సభకు నేడెన్నుకోబడెను
శాసనసభ్యుడై - శక్తియుక్తుల జూపి
ప్రభుతను మెప్పించు ప్రజ్ఞగలదు
అధినాయకుడన - అందరిమన్ననల
నంది ప్రతినిధిగనెన్నికయ్యె
కింజరాపెర్రన్నాయుని కీర్తి ప్రభలు
ఉత్తరాంధ్ర - నెల్లెడల - నేడు విస్తరించె
పార్లమెంట్‌లో ప్రతిపక్ష నాయకుండు
ఎత్తరాజెండ బడుగులదె ఉత్తరాంధ్ర

- ప్రజాకవి - వంగపండు

19) బొత్స సత్తిబాబు - మత్సలేనివాడు
రాజకీయాలలో రాణించువాడు
ప్రజలే రాజులనుచు - రాజులనెదిరించి
పార్లమెంట్‌లో తను సభ్యుడయ్యె
బొబ్బిలి ప్రజలనిబ్బరమేమిటో
ఢిల్లీ సభలలోన - వెల్లడించే
సేవకాప్రవృత్తిని చేధించి నిలుచుచు
ప్రజలెయజమానులనపలుకువాడు
కాంగ్రెస్‌కు ఉత్తరాంధ్రలో గట్టిపట్టు
జనులసేవకు తన జన్మని చాటువాడు
తనసతీమణి ఝాన్సీ పరిష్కర్త్రెనకద
ఎత్తరాజెండ - బడుగులదె - ఉత్తరాంధ్ర

20) ఆధునిక రాజ్యాంగ మవతరించగనేడు
నేటి సంఘము పునర్విభజనందె
తరతరాలనుండి చదువు సంధ్యలు గలిగి
జీవించు - జాతులను - "శిష్టులనిరి"
వెట్టిచాకిరి చేస్తు - మట్టి బ్రతుకులనందె
పరిచర్యజాతులను "బడుగులనిరి"
సాంప్రదాయాచార పద ఘట్టనలలో
నలిగిన - జాతులను - "దళితులనిరి"
శిష్టులన - బ్రహ్మ - క్షత్రియ - వైశ్యులే కద
బడుగలన - శూద్రులు - నాల్గవవర్ణముకద
దళితులన - మాల - మాదిగలు - మనవారేకదర
ఎల్లరము - మనము - ఒకేజాతి బిడ్డలమురా

----- ★ -----

- ప్రజాకవి - వంగపండు

## బి.సి. వెలుగు కిరణాలు

**కాకుళం**

బొడ్డేపల్లిరాజగోపాలరావు

మజ్జి తులసీదాస్

. గొర్లె శ్రీరాములునాయుడు

. డోల సీతారామ్

. గుండు నరసింగరావు

. తంగి సత్యనారాయణ

. త్రిపురాన రాఘవదాస్

. బాబు పరాంకుశం

. తమ్మినేని సీతారాం

0. సి.హెచ్. శ్యామలరావు

1. పేరుకట్ల అప్పలనాయుడు

2. కళా వెంకట్రావు

.3. గౌతు శ్యామసుందర

14. గొర్లె హరిబాబు

15. కణితి విశ్వనాథం

16. అప్పయ్య దొర

17. ధర్మాన ప్రసాదరావు

18. కింజరాపు ఎర్రంనాయుడు

19. లుకలాపు లక్ష్మణదాను

**విజయనగరం**

1. వాసిరెడ్డి కృష్ణమూర్తినాయుడు
2. చీకటి పరశురాంనాయుడు
3. మరిశర్ల వెంకటరామినాయుడు
4. కొమ్మూరు అప్పుడుదొర
5. వంగపండు పారన్న
6. పెద్దింటి రామస్వామినాయుడు
7. తెంటు లక్ష్మినాయుడు
8. శంబంగి అప్పలనాయుడు
9. బొత్స సత్తిబాబు
10. పొన్నాపు సూర్యనారాయణ
11. బేబీ నాయన (బొబ్బిలిచినరాజు)
12. కె. వీరభద్రస్వామి
13. టి. సన్యాసినాయుడు
14. వంగపండు నారాయణ అప్పలనాయుడు
15. వాసిరెడ్డి వరదరామారావు
16. లగుడు సింహాద్రి
17. నతివాడ నారాయణస్వామి
18. కోట రవి
19. ద్వారపురెడ్డి రామ్మోహనరావు
20. కొల్లి కూర్మినాయుడు
21. పెద్దింటి జగన్మోహనరావు
22. యాళ్ల శశిభూషణరావు

**విశాఖపట్నం**

1. ఎస్.ఆర్.ఏ.ఎస్. అప్పలనాయుడు
2. గుడివాడ గుర్నాధరావు
3. పెతకంశెట్టి అప్పలనరసింహం
4. చింతకాయల అయ్యన్నపాత్రుడు
5. వారాడ నారాయణమూర్తి
6. కె. వి. రమణ
7. నబ్బం హరి
8. కురచరామినాయుడు
9. వి. పాలవెల్లి
10. మిలట్రీనాయుడు
11. పైల అప్పలనాయుడు
12. పప్పల చలపతి
13. బండారు నారాయణమూర్తి
14. తిప్పల గురుమూర్తిరెడ్డి
15. పి. వి. చలపతి
16. దాడి వీరభద్రరావు
17. బలిరెడ్డి సత్యారావు
18. అల్వారుదాసు
19. కొణతాల రామకృష్ణ

– ప్రజాకవి – వంగపండు

# ఉత్తరాంధ్ర

(చరిత్ర-సంస్కృతి)

## చతుర్ధ భాగము

### 3వ ప్రకరణం - మనభాగ్యరాశి (భారతం)

1) ఆంధ్రనిఘంటువు - అర్ధము తెల్పినది
బడుగుడనగ - నల్పుడ సమర్థుడనుచు
గీత భగవద్వాణి - చేతలను "కర్మల"నె
కలిమికి - బలిమికి - కారణమనె
వర్ణ సంకరం - సంభవమనే - గీత
నాల్గవవర్ణం - ధరణివెలసె
పరువుప్రతిష్టనిల్పు మన కర్మలేకద
దేహధర్మమువలన నిర్మితమివి
జీవనావృత్తులకు - మనమే త్రోవలముర
కర్మత్రయానికి - మనమె - బాధ్యులముర
భారతం త్రయీ ధర్మ సారముకద
బ్రతుకు బండికి సారధిబడుగువాడె

2) ధరలోన శూద్రాయమతిందద్యాత్తన
ఎదురొడ్డికాదని నిలచినాము
శూద్రుడు - హీనుడన - చులకనకాదని
గొప్పదనము - జూపి మెప్పునందితిమి
మూర్ఖదురాచార - కర్మపరులమన
విజ్ఞాన కర్మల వెలుగు జూచితిమి
కాయకర్మలవి - కనిష్టమనగను
కలిమికిదే - కర్తని - తెలియబలికితిమి
బడుగులన - నిఘంటువార్ధముమారవలయు
శ్రేష్టతకు - గౌరవానికి - నిలువెత్తు మనమె.
ఆదిలో అల్పులముకాము - అతిరధులము
బడుగులమ్మేము - భంగపడితిమి - రంగుపూయ.

- ప్రజాకవి - వంగపండు

5 ) కళింగ రాజ్యమును - ఇలను స్థాపించిన
ఖారవేల ప్రభువు - దళితుడేను
శ్రీకూర్మనాధునికి - చేతిమ్రొక్కులనిడె
ఆదిలో కిరాత - ప్రభువు - కదర
నైషధము వివరించే - కిరాతకేశ్వరుడు
దమయంతి - స్వయంవర ప్రతినిధికద
భోజరాజునాడు - కులభ్రష్టుడన్నను
కళింగ - కవిని - సత్కరించె
దళితులతిరధులువారవైదికులుకద
బ్రహ్మక్షత్రియవైశ్యులు వైదికులుకద
మన మనార్యులం - శూద్రవర్ణసంకరులము
బడుగులం - బడుగు సంస్కృతి - మనదికదర

6 ) తొలివేద యుగమున - త్రయీవర్ణాలై
మలివేదయుగమున - నాల్గు వర్ణాలు
త్రయీవైదికులుగ - వర్ధిల్లుతూవచ్చి
ఆర్యధర్మమనగ - అవనిలోన
కృష్ణుడు - గీతలో - వర్ణ సంకరమన
శూద్రులన నొక వర్ణముద్భవించె
"పరిచర్యాత్మకం" శూద్రకర్మ అయ్యె
స్వాభావికాత్మకు - సాగినడువ
వైదికేతరులనిమనం - పిలవబడిన
వర్ణసంకర - శూద్రులననియె - గీత
పుట్టుకలనిచ్చు - దేవుడే యాదవుడయె
పశులకాపరె - శూద్రకర్మకు ప్రాణరక్ష

7) బడుగు జన బాంధవులె - భారతం నడిపిన
కురుపాండవుల పోరాట మనిరి
కృష్ణుడు - యాదవుడు - బడుగుకులజుడనిన
తండ్రి వసుదేవుడు - రాజు అనిరి
శూద్రవనిత రాధ - పోషించకర్ణుని
కుంతితనయుడనుచువంతపాట
విదురుడు - వ్యాసుని విజ్ఞానసుతుడన
దాసిపుత్రుడనుచు దండమిడిరి
కర్ణుడేలేని భారతం - కనబడదుర
కృష్ణుడేలేక భారతం - వినబడదుర
మత్స్యగంధిసుతుడే మన వ్యాసుడుకద
భారతము వ్రాసె - బడుగుజన - బాంధవుండు

8) పుట్టిన జన్మొకటి - పట్టిన త్రోవొకటి
జన్మకర్మొకటి ప్రవృత్తి కర్మ
సద్గతికి - గోత్రాలు - ప్రతిభ సామర్ధ్యాలు
పుట్టుకకు సృష్టియే -మూలముకద
దేవదేవి - ప్రవృత్తి - దేదీప్యమానమై
మనుజసంతతికెల్ల - మహిమనిచ్చు
ప్రవృత్తి - నేతర కర్మ - "కర్మ" ధర్మముసాగు
విద్యుక్తకర్మది - విజయముకద
సూతుడు - ఉవాచ - ఇతనిదే సూక్తికదర
విదురుడే - రాజసభలోన - విజ్ఞానికదర
కర్ణుడే - యుద్ధకాండకు - కారకుడుకద
కృష్ణుడే - జగత్కర్మల - నాంది కదర

- ప్రజాకవి - వంగపండు

9 ) మానసిక కర్మది - మన వశము కాదనిన
వశపరుచుకొని - వృద్ధినందినాము
వాచక కర్మది - మనకురాదనినను
పట్టుదల కృషిని చేపట్టినాము
తాపసిక కర్మది - మనమదికి రాదనిన
యోగబలముతో నొప్పారినాము
రాజసిక కర్మది - మనకు చెందదనిన
రాజ్యపాలనలో - రారాజులముర
కర్మబ్రహ్మోద్భవం జగత్కార్మకదర
కర్మలు పవిత్రములుదైవ సృష్టి కదర
కలిమిబలిమి కర్మలకు - సాక్షిమనమె
బడుగులదె భారతం - మన భాగ్యరాశి

10 ) వర్ణ వ్యవస్థలో - నార్య సంస్కృతి
బ్రహ్మక్షత్రయ వైశ్యులనబడుదురు
వర్ణ సంకరనార్య - బడుగు - సంస్కృతికి
శూద్రులే - నాల్గవవర్ణమగును
వర్ణ పరిధికతీత - దళిత - సంస్కృతది
ప్రత్యేక - స్థితిగతిని - పరిడవిల్లు
పుట్టుకతోక్షుద్రులన - వేల కథలు వెలసె
పాపిష్టి - జన్మలని - కట్టుకథలు
కృష్ణుడే - మనల - రక్షించునాథుడనగ
బడుగు - వాడన - రథమును - నడిపినాడు
పాపయోని సంభవులను - కాపాడదలచి
ఎల్ల "భారతం" - రక్షించ పృథ్వివెలసె.

- ప్రజాకవి - వంగపండు

11) శిష్టులం మేమన - భ్రష్టులు మీరన
బడుగులెల్లరు - నాడు - భంగపడిరి
ప్రతిభ సామర్థ్యాలు - మాపంచనుండునన
బడుగులెల్లరునాడు - భ్రమలో పడిరి
పుట్టుకతో పవిత్రత - పుట్టుకొచ్చుననగ
బడుగులెల్లరు - నాశ్చర్యపడిరి
యోగ - భాగ్యాలకు - యోగ్యులమ్మే మన
బడుగులెల్లరు - నోరు - కదపలేదు
చూడబడుగులెల్లరానాటి - శూద్రులేకద
శిష్టులన - బ్రహ్మ క్షత్రియ వైశ్యులే కద
నేటి శిష్టులానాటి శిష్టులన, నిజముకాదు
బడుగులకు - వీరె మార్గ దర్శకులు - కదర

12) మౌర్య వంశానికి - మూల కర్తఎవరు
శూద్రకులస్త్రీమురపుత్రుడేను
బ్రహ్మవిద్యనేర్చె - జాబాలి - ఎవరురా
చులకనగ - జూచెడి కులమువాడె
దాల్బుడు - మహీదాస్ - స్మృతికర్తలెవరురా
శూద్ర వంశస్థులే - చూడగాను
విదురుడు - రైక్యుడు - విజ్ఞానవేత్తలకు
జన్మనిచ్చె శూద్రవంశమేను
శూద్రులన - చులకనన - కుదరదుకద
జ్ఞానవిజ్ఞాన - ధనులకు - జన్మనిచ్చె
బడుగులకు - బ్రహ్మజ్ఞాన - మబ్బెనుకద
మనకు తెలియని బ్రహ్మవిద్య - మహినిలేదు

- ప్రజాకవి - వంగపండు

13) గుణకర్మలను బట్టి జనులను జమకట్టి
ప్రవృత్తితో వృత్తిని సలుప మనేగీత
సాత్విక - రాజసిక - తామసిక గుణాలు
సృష్టి సంభవాలు - చూడగాను
హేయమైనదేది విలువైన, గుణమేది
మనము కర్తల-మనుట పాడికాదు
స్వాభావికంబది - జాతికర్మ ప్రవృత్తి
గుణకర్మజగతికి గురుతుకదర
కర్మబ్రహ్మోద్భవం - పుట్టుక కర్మ కదర
కర్మనే నిందించపాపము సంభవించు
కులం తక్కువ - జాతి తక్కువ - కూతవద్దు
దైవదృష్టిలో హెచ్చుతగ్గులులేవుకదర

14) అతిపురాతనకాల మందున - భారత్‌లో
వంశపారంపర్య రాచరికమె
పెద్దకొడుకెవ్వరైన ఏలికప్రభువులు
రాజ్యాధికారము - సంక్రమించు
తమ్మునిబిడ్డలు - తగవులాడరాగ
కురుపాండవులకు - కూర్మిచెడెను
యాదవకృష్ణుడు - బడుగుజనకర్ణుడు
చెరి ఒక ప్రక్కన చేరినారు
రాచబిడ్డలు మధ్యను రణం సంభవించ
భారతంబని వ్యాసుడు రచనజేసె
ఆర్యరాజ్య కుటుంబాలు అంతరించ
బడుగువర్గాలే భూమికి - పాలకులుర

- ప్రజాకవి - వంగపండు

15) దాసరాజునింట మత్స్యగంధి పెరగ
రాజర్షి వీర్య సంజనితయనిరి
పరాశరుడీమెతో కామకేళినిదేల
సూతకుల ప్రసూత సుదతికాదనిరి
దేవయాని రాణిసంతతిని కాదని
దాసిసుతునకుయయాతి రాజ్యమిచ్చె
తల్లి ఆనతిమీర వ్యాసుడు - జన్మిడ
విదురుడొక దాసి బిడ్డడయ్యె
బీజమే పుట్టుకకు - మూలతేజమనిరి
క్షేత్ర ప్రాధాన్యతను - వారు చెరిపినారు
తారుమారైన పుట్టుకలేవేరవునిల
బడుగులదె భారతం - మన భాగ్యరాసి

16) యయాతి - ప్రభువుకి - దాసి శర్మిష్టికి
పుట్టినబిడ్డడే - పూరుడుకద
ఇతడె చక్రవర్తి ఇతని వంశజుడె
దుష్యంత ప్రభువుగ భువిని ఏలె
శకుంతలను చేపట్ట - భరతుడు - జన్మించె
ఈతని వంశజుడు - ప్రదీపుడుకద
శిబి పుత్రిక సునంద పెండ్లియాడెనితని
పుత్రులు ముప్పురులో - శంతనుండొకడు
శంతనుడు - మత్స్యగంధిని - మనువాడబోవ
దాసరాజు - తన పుత్రికతనయుని రాజు చేయ
మాట ఇచ్చిన పిల్ల నిచ్చెదనని తేటపరచ
భీష్మ ప్రతిజ్ఞ భారతం కురుక్షేత్రమయ్యె

- సమాప్తం -

ప్రజాకవి - వంగపండు
పెందుర్తి

- ప్రజాకవి - వంగపండు

# ప్రజాకవి - వంగపండు - ఇతర - రచనలు

## సాహిత్యం

1. జీవితం - ముక్తి - మోక్షం (భగవద్గీత)
2. చాణుక్య - చంద్రగుప్త (నాటకం)
3. కాంతికిరణం (బైబిల్)
4. ప్రజలకథ (పద్యకావ్యం)
5. సర్దార్ గౌతులచ్చన్న (జీవిత చరిత్ర)
6. ఆంధ్ర తెలంగాణా విభజన
7. ప్రణయకలహం (పద్యకావ్యం)
8. స్వామి వివేకానంద. (నాటకం)
9. సైరంధ్రి (భారతం)
10. పాంచజన్యం (గేయకావ్యం)
11. వంగపండు శతకం
12. ఉత్తరాంధ్ర (చరిత్ర-స్మృతి)
13. అమ్మోరు - పురాణం (దేవీ భాగవతం)
14. భగవద్గీతానువాదం (తేటగీతల్లో)

## పార్టి సాహిత్యం

1. కాంగ్రెస్ పార్టి చరిత్ర
2. నెహ్రూ సోషలిజం
3. డంకెల్ ఒప్పందం
4. ఇందిరమ్మ 20 సూత్రాలు
5. జన్మభూమి
6. సారాభాగోతం
7. సమరశంఖారావం
8. సరళీకృత ఆర్థిక విధాన



డా॥ వై. ఎస్. రాజశేఖరరెడ్డి, C.L.P. Leader, ప్రజాకవి - వంగపండు